# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక ఫొటోశీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో
ఆకర్షణలు.



# కాల్గేట్‌తో చెడ్డ శ్వాసను నిరోధించండి
# రోజంతా దంతక్షయం జరుగకుండా కాపాడుకొనండి!

ఎందుచేతనంటే: ఒక్కసారి తోముకుంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసనను మరియు దంత క్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి చెడ్డ శ్వాసను వెంటనే నిరోధించిందని మరియు భోజనం అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొనుట వల్ల ఎక్కువ మందికి దంతక్షయమును బాగా అరికట్టిందని, పూర్వము దంతశాస్త్ర చరిత్రలో ఎన్నడూ తెలియ జేయనంతగా కొన్ని పరిశోధనల వల్ల నిరూపించబడినది! ఒక్క కాల్గేట్ మాత్రమే దీనికి రుజువును కలిగివున్నది.

పిల్లలు కాల్గేట్‌తో క్రమముగా పళ్ళు తోముకునే అలవాటును తేలికగా అవలంబిస్తారు. ఎందుచేతనంటే ఎక్కువ సేపు నిలచే దాని పిప్పరమెంట్ లాటి సువాసనంటే వారికి చాలా ఇష్టం.

శుభ్రత కొరకు, తాజా శ్వాసకొరకు మరియు పండ్లు తెల్లగా వుండుట కొరకు కాల్గేట్‌తో పండ్లను క్రమముగా తోముకొనండి.

మీకు పౌడర్ కావాలంటే, ఈ లాభములన్నింటినీ కాల్గేట్ టూత్ పౌడర్ ద్వారా పొందగలరు... ఒక డబ్బా నెలల తరబడి వస్తుంది...







...ప్రపంచములోని ఏ ఒక్క ఇతర డెంటల్ క్రీమ్‌కన్నా కాల్గేట్‌నే ఎక్కువ మంది వాడుతున్నారు

అది యేటి ఇల్లు బిడ్డపాపలేని ఇల్లు
అది యేటి పాప ఆటపాట లేని పాప
అది యేటి ఆట ప్యారీస్ మిఠాయిలేని ఆట

ఊమ్....ప్యారీ మిఠాయిలు ఎంతైనా
అనివార్యమైనవి. ఎంతో రుచికరంగా
పుష్టికరంగా వుంటాయి. పిల్లలతోపాటు
మీరూ పంచుకోండి-అప్పుడు
తెలుస్తుంది. జీవితం ఎంత విలాసంగా వుంటుందో

క్రొత్తరకాలు రుచి చూచారా?
ఆరంజి రోల్స్ - బ్లాక్ కరన్ట్స్ -
పైన్ఆపిల్ టాఫీ - క్రీమీరోల్స్




ప్యారీస్ - విశిష్టకరమైన
మిఠాయిలు
తయారుచేయువారు

ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

PRS-4415

# ముఖ్య గమనిక

'చందమామ' పత్రికకు సంబంధించిన చందాలు, ఏజన్సీ డిపాజిట్లు, ఇండెంటు విలువలు, ప్రకటన చార్జీలు మొదలైనవన్నీ క్రింది చిరునామాకు పంపండి.

## డాల్టన్ ఏజన్సీస్,

'చందమామ బిల్డింగ్స్'

వడపళని :: మద్రాసు - 26

---


FALCON
75



**

# A GREAT NAME IN HANDLOOMS

## AMARJOTHI
### FABRICS

## BEDSPREADS
## FURNISHINGS
## & TOWELS

MFG: AMARJOTHI FABRICS
POST BOX NO 22 KARUR.





---



పొదుపునకు...

ప్రకాశవంతంగా, పరిశు-
భ్రంగా చిరకాలం, పొదు
పుగా పని చేసే లాంపు.

ఎల్లపుడును వాడండి

## బెంగాల్

ఇండియాలో శ్రేష్టమైనది
బెంగాల్స్ కొయిల్డ్ కాయిల్ లాంపులే
ఎల్లపుడు వాడండి. నమ్మకమైనది.

మీకు చల్లని, ప్రకాశవంత
మైన వెలుగునిచ్చే లాంపు

బెంగాల్ **హంస**

పాలతెలుపు లాంపు.



ఆంధ్రప్రదేశ్ కు సోల్ సెల్లింగ్ ఏజెంట్లు:
జి.ఏ. పరశురామ్ & కంపెని.
11-4-658/2, లకడికాపూల్. హైదరాబాద్. 4. A.P.

బెంగాల్ ఎలెక్ట్రికల్ కంపెనీ, బెంగళూరు-3 & మదరాసు-17



# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

జ్ఞానం అన్నది అనుభవానికి దగ్గిరలో ఉంటేనే రాణిస్తుంది. అచ్చుగా తెలివితేటలూ, యుక్తీ జ్ఞానానికి చిహ్నాలు కావు. "మూడు ప్రశ్నలు" అన్న కథలో రాజకుమారుడు రాజకుమార్తె ప్రశ్నలకు తన అనుభవం నుంచే సమాధానాలు చెప్పి, ఆమెను తృప్తిపరిచి పెళ్ళాడగలుగుతాడు.

"ఘోరపరాజయం" [బేతాళ కథ]కు ఆధారం అల్లాడ లక్ష్మినారాయణ పంపిన కథ.

సంపుటి 42 ఫిబ్రవరి '68 సంచిక 2





# భారత చరిత్ర



ఆ కాలంలో మహాదాజీ సింధియా అత్యుత్తమ మహారాష్ట్ర నాయకుడు. సల్‌బై సంధిలో బ్రిటిషువారు ఆయన స్వాతంత్ర్యాన్ని పూర్తిగా అమోదించారు. పూనా ప్రభుత్వంతో ఆయన నిర్దుష్టమైన పద్ధతిలో వ్యవహరించాడు.

సల్‌బై సంధి అనంతరం ఏర్పడిన పరిస్థితిని వినియోగించుకుని సింధియా, ఉత్తరభారతంలో తన బలాన్ని పెంపొందించుకుని, దృఢతరం చేసుకున్నాడు. మహారాష్ట్రులకు సంప్రదాయసిద్ధమైన యుద్ధవిధానాన్ని విడిచిపుచ్చి, ఆయన తన సేనలో రాజపుత్రులనూ, ముస్లిములనూ చేర్చుకుని, పాశ్చాత్య శాస్త్రీయపద్ధతులలో సేనను రూపొందించి, అందులో సైనికనిపుణుడుగా ఒక ఫ్రెంచివాణ్ణీ, అనేక దేశాలకు చెందిన యూరోపియనులనూ ప్రవేశపెట్టాడు. ఆయన ఢిల్లీ వెళ్ళి, అక్కడ నామమాత్రపు చక్రవర్తిగా ఉన్న రెండవ షా అలంను తన కీలుబొమ్మను చేసుకుని తన పైవాడైన పేష్వాకు "వకీలిముత్‌లుక్" పదవి ఇప్పించి, తాను అతని సహాయకుడి (నాయిబ్) పదవి సంపాదించుకున్నాడు. ఆయన ఢిల్లీలోనే ఉండిపోయి, మొగలు సేనల పైన ఆధిపత్యం సంపాదించి, పైకి ఢిల్లీ సుల్తానుకు గులాముగా ఉంటూ, అతణ్ణి తన ఇష్టం వచ్చినట్టు ఆడించాడు.

1792 నాటికి మహాదాజీ ప్రభ ఉత్తర హిందూస్థానంలో పరమోచ్ఛదశను అందుకున్నది. రాజపుత్రులూ, జాత్‌లూ ఆయనకు లోబడ్డారు. ఇక ఆయన పూనా కోటలో పాగా వెయ్యవలసి ఉంది. కాని అక్కడ అధికారం నిర్వహించే నానాఫడ్నవిస్ ఉద్దండుడు. అందుచేత మహాదాజీ పేష్వాను సందర్శించే మిష మీద 1792లో దక్షిణయాత్ర చేశాడు. ఈ సమయంలో

77. మహాదాజీ సింధియా



మహాదాజీ పొరుగువాడైన తుకోజీహోల్కర్ ఆయనపై కత్తికట్టి, అజ్మీరు సమీపంలో లఖేరీ వద్ద యుద్ధం చేసి ఓడించబడ్డాడు. కాని మహాదాజీ ఆశయం పూర్తి కాలేదు. 1794 ఫిబ్రవరి 12 న ఆయన పూనాలో, తన 67 వ ఏట మరణించాడు.

మహాదాజీ సింధియాకు అతని దత్త పుత్రుడు దౌలత్‌రావు సింధియా వారసు డయాడు. అతని వయసు పదమూడేళ్ళు. సింధియా మరణం ఇంగ్లీషు వారికి మహోపకార మయిందని చెప్పవచ్చు. అతను ఎలాగైనా వారికి పక్కలో బల్లెమే.

ఇప్పుడు మహారాష్ట్ర వ్యవహారాలకు నానా ఫడ్నవిస్ నాయకు డయాడు. నర్మదకు దక్షిణంగా ఉండే ప్రాంతాలను మహా రాష్ట్రులు కోల్పోయి ఉన్నారు. వాటిని తిరిగి సంపాదించు కోవాలంటే వారు మైసూరు టిప్పుసుల్తానుతో యుద్ధానికి దిగటం తప్పని సరి. ఇందుకు నాందిగా మహారాష్ట్రులు నిజాముతో స్నేహ ఒడంబడిక (జులై 1784) చేసుకుని, 1785 డిసెంబరు 1 న హరిపంత్ ఫడ్కే నాయకత్వాన పూనా నుంచి మహారాష్ట్ర సేనను పంపారు.

టిప్పు తన శత్రువును ఎదుర్కొనటానికి దుర్బలమైన యత్నాలు కొన్ని చేశాడు గాని,



ఇంగ్లీషువారికీ, మహారాష్ట్రులకూ మధ్య సఖ్యం ఏర్పడుతుందని భయపడి, మహా రాష్ట్రులతో రాజీపడి, 1787 ఏప్రిలులో సంధి ఒడంబడిక చేసుకున్నాడు. ఇందువల్ల టిప్పుసుల్తాను 45 లక్షల రూపాయలు ఇచ్చుకోవలసి వచ్చింది. అయితే ఈ సంధి ఎంతో కాలం దక్కలేదు. ఇంగ్లీషువారికీ, టిప్పుకూ మధ్య 1789 లో వైరం ఆరంభం కాగానే టిప్పుకు విరుద్ధంగా మహారాష్ట్రులూ, నిజామూ కూడా కార్న్‌వాలిస్‌తో సంధి ఒడంబడిక చేసుకున్నారు. కాని ఈ త్రిపక్ష సంధిలో సత్తా ఏమీ లేదు. టిప్పు తాకిడికి భయపడి సఖ్యత నెరపినప్పటికీ నిజాముకూ,



17

మహారాష్ట్రులకూ వైరం ఉండనే ఉన్నది. టిప్పూ భయం కాస్త తగ్గగానే మహారాష్ట్ర నాయకులైన పేష్వా, దౌలత్‌రావ్ సింధియా, తుకోజీహోల్కర్, బిరారురాజా ఏకమై నిజాము పైన కత్తికట్టారు.

ఉభయ పక్షాలకూ యుద్ధం జరిగింది. 1795 మార్చిలో నిజాము ఓడిపోయి సంధి చేసుకుని, అంతులేని ధనాన్నీ, రాజ్య ప్రాంతాలనూ కోల్పోయాడు. నిజాముకు బ్రిటిషువారు ఏమీ సహాయపడ లేదు.

ఇంగ్లీషు వారికీ మైసూరుకూ మధ్య యుద్ధాలకు కారణం, 18 వ శతాబ్ది ఉత్తరార్థంలో హైదరూ, టిప్పూ ఇంగ్లీషువారి పురోగమనానికి రాహుకేతువుల 'లాగా తయారు కావటం.

హైదరు చదువుసంధ్యలు బొత్తిగా లేని వాడు, కాని అమితమైన ధైర్యసాహసాలు గలవాడు. అతను మైసూరు సేనలలో జీత భత్యాలు లేకుండా పనిచేస్తూ, యుద్ధాలలో తన పరాక్రమం ప్రకటించి పైకి వచ్చిన వాడు. కాలక్రమాన మైసూరు రాజ్యాధికారాలన్నీ అతని చేతిలోకే వచ్చాయి. అతని అభ్యుదయాన్ని మహారాష్ట్రులూ, నిజామూ, ఇంగ్లీషువారూ సహించలేక పోయారు.

1765 లో మహారాష్ట్రులు తన మీద ఎత్తి వస్తే, హైదరు వారితో సంధి చేసుకుని, పరిహారం కింద వారికి 32 లక్షల రూపాయలూ, గుత్తి, సావనూరు ప్రాంతాలూ ఇచ్చుకున్నాడు. 1766 నవంబరులో మద్రాసు (బ్రిటిషు) ప్రభుత్వం నిజాము నుంచి ఉత్తరసర్కారు జిల్లాలు తీసుకుని, హైదరు పైన నిజాము చేసే యుద్ధంలో సహాయపడటానికి అంగీకరించింది. మొత్తం మీద హైదరుకు విరుద్ధంగా మహారాష్ట్రులూ, నిజామూ, ఇంగ్లీషువాళ్ళూ త్రిపక్ష సంఘటనగా ఏర్పడ్డారు. అయితే తనపై మొదట దాడి చేసిన మహారాష్ట్రులను హైదరు డబ్బిచ్చి వదుల్చుకున్నాడు.






# వింత దయ్యం

పూర్వం ఒక చిన్న గ్రామంలో రామయ్యా, రంగమ్మా అనే దంపతులు ఉండేవారు. రామయ్య పొలం పని చేసేవాడు. రంగమ్మ ఇంటి పనులన్నీ చేసుకోవటంతోబాటు, పాడి చేసి, పాలూ, పెరుగూ అమ్మి, భర్త సంపాదనకు తన సంపాదన జోడించేది.

తగినంత డబ్బు చేరగానే రామయ్య ఒక పాడు పడిన ఇల్లు కొని, దాన్ని మరమ్మతు చేయించి, భార్యతో సహా అందులో గృహప్రవేశం చేశాడు.

- ఆ ఇంట్లోకి వాళ్ళు అడుగు పెట్టినది మొదలు కొన్ని వింతలు ప్రారంభమయాయి. ఒక రోజు ఉదయం రంగమ్మకు జ్వరం వచ్చింది. ఆ క్రితం సాయంకాలమే రామయ్య పొరుగూరు వెళ్ళాడు. రంగమ్మ లేచి, మజ్జిగ చిలికి, తన భర్త వచ్చే లోపుగా వంట చేసి ఉంచుదామనుకున్నది. కాని ఆమెకు లేచే ఓపిక లేకపోయింది. లేపబోయిన మనిషి మళ్ళీ పడుకుని మగతగా నిద్రపోయింది.

కొంత సేపయాక ఆమె మళ్ళీ మేలుకుని, ఎట్లాగో ఓపిక తెచ్చుకుని వంట ఇంట్లోకి వెళ్ళేసరికి ఆమెకు అమిత ఆశ్చర్యం కలిగింది. మజ్జిగ చిలికి ఉన్నది. అందులో నుంచి తీసిన వెన్న దుత్తలో పెట్టి ఉన్నది.

వేసిన తలుపులు వేసినట్టే ఉన్నాయి; ఎవరు లోపలికి వచ్చారు, ఎలా వచ్చారు, ఈ పనులన్నీ ఎలా చేశారు? ఎంత ఆలోచించినా రంగమ్మకు ఏమీ అర్థం కాలేదు. రామయ్య వచ్చాక, ఇలా జరిగిందని చెబితే, అతను పెళ్ళాం మాటలకు నవ్వాడు.

కొంతకాలం గడిచింది. రంగమ్మ గర్భవతిగా ఉండి, ఓపలేని స్థితిలో కొన్ని కొన్ని పనులు చెయ్యలేక వదిలేస్తూ వచ్చింది. కాని ఆ పనులు ఎలాగో వాటంతట అవే అయిపోయేవి. రంగమ్మకు అంతా వింతగా

తుమ్మలచెర్వు మాధవరావు





అయితే, రంగమ్మ మర్నాడు ప్రసవిస్తుం దనగా వెంకమ్మ రానే వచ్చింది. ఆమె రాకకు దంపతులిద్దరూ ఎంతో సంతోషించారు. కూతురి చేత కాన్పు చేయించి, ఆమెకు పథ్యం పెట్టినాక, ఇంటి దగ్గిర బోలెడు పనులున్నాయంటూ వెంకమ్మ వెళ్ళిపోయింది.

ఊరికి వెళ్ళిపోయిన వెంకమ్మ మర్నాడే మళ్ళీ తిరిగి రావటం చూసి రంగమ్మ ఆశ్చర్యపోయింది. అంతలోనే అత్తగారు మళ్ళీ ఎందుకు వచ్చిందో రామయ్యకూ అర్థం కాలేదు.

"పురిటికి రాలేకపోయానమ్రా! ఏం చేసేదీ? నెల్లాళ్ళుగా ఒకటే సుస్తీ! కాస్త రెండు రోజుల్నుంచీ ఇటూ అటూ తిరుగుతున్నా. చూసి పోదామని ఎలాగో ఓపిక చేసుకుని వచ్చా," అన్నది వెంకమ్మ.

కూతురూ, అల్లుడూ కొయ్యబారిపోయి తన కేసి అలా ఎందుకు చూస్తున్నారో ఆవిడకు అర్థం కాక, "ఏమే, పురుడు పోసేందుకు రాలేదని కోపం వచ్చిందా ఏం? ఏడీ? మనవణ్ణి చూపించు!" అన్నది.

"నువ్వు వచ్చి పురుడు పోస్తివి కాదుటమ్మా? ఏమీ ఎరగనట్టు మాట్లాడతావేం?" అన్నది రంగమ్మ.

ఉండేది. ఎవరూ కనిపించరు. ఏ దయ్యమో, భూతమో ఈ పనులు తనకు చేసి పెడుతున్నదని ఆమెకు భయంగా ఉండేది. రామయ్యతో చెబితే, "అన్నీ నువే ఊహించుకుంటున్నావు!" అనేసేవాడు.

రంగమ్మ ప్రసవించే రోజులు వచ్చాయి. పురుడు పోయటానికి రమ్మని రంగమ్మ, రెండు గ్రామాల అవతల ఉన్న తన తల్లికి కబురు చేసింది. తనకు రావాలనే ఉన్నది గాని, ఒళ్ళు బాగుండటం లేదు, రాగలనో, రాలేనో అని రంగమ్మ తల్లి వెంకమ్మ జవాబు పంపింది. తల్లి రాకపోతే తనకు మరెవరి అండా లేదని రంగమ్మ దిగులుపడింది.



వెంకమ్మకు అంతా అయోమయంగా ఉన్నది. జరిగినదంతా రంగమ్మ చెప్పినాక అవిడ, "ఏ దయ్యమో, భూతమో నా రూపున వచ్చి ఉండాలి. లేకపోతే ఏమనుకోవాలీ?" అన్నది.

ఈసారి రామయ్యకూడా నమ్మకం కలిగింది. తన అత్తగారి రూపులో వచ్చి పురుడు పోసిన మనిషిని తాను కళ్ళారా చూశాడాయె.

దయ్యాలూ, భూతాలూ ఉన్న పక్షంలో చూస్తూ ఊరుకోరాదన్నది వెంకమ్మ. పొరుగూళ్ళో ఉన్న భూతవైద్యుణ్ణి పిలుచుకొస్తానని రామయ్య బయలుదేరి వెళ్ళాడు.

ఆ రాత్రే అకాలంగా బ్రహ్మాండమైన వర్షం ప్రారంభమయింది. వాన చప్పుడుకు రంగమ్మ నిద్రలేచి, కిందటి రోజు దొడ్లో ఆరబోసిన మిరపకాయల మూట దొడ్లోనే ఉన్నదనీ, వానకు తడుస్తున్నదనీ తెలుసుకున్నది. రామయ్య ఉంటే ఏదో ఒకటి చేసేవాడు. కాని అతను ఊళ్ళో లేక పోవటం చేత, ఏమి చెయ్యటానికీ లేదు. తానా, పచ్చి బాలింతరాలు; తన తల్లి పడి లేచిన మనిషి. గేదెలు కూడా వానలో తడవవలిసిందే, చేసేదేమీ లేదు.

అయితే, తెల్లవారి రంగమ్మ లేచి చూసేసరికి మిరపకాయల బస్తా వసారాలో గోడకు



చేరబెట్టి ఉన్నది, గేదెలు కూడా వసారా లోనే కట్టేసి ఉన్నాయి! రంగమ్మా, వెంకమ్మా భయంతో ఒకళ్ళముఖాలొకరు చూసుకున్నారు.

మరి కాస్సేపటికి రామయ్య భూత వైద్యుణ్ణి వెంట బెట్టుకు వచ్చాడు. భూత వైద్యుడు అంతా విని, "ఇదంతా గాలిచేష్ట అనటానికి సందేహం లేదు. కాని ఈ దయ్యం ఉపకార బుద్ధి గలదిగా కనబడుతుంది. కాని మంచి దయ్యాలు కూడా ఇంట ఉండటం అంత మంచిది కాదు. వాటిని బట్టి చెడ్డ దయ్యాలు కూడా చేరవచ్చు. మీ కింత మంచి చేస్తున్న దయ్యాన్ని మారణహోమం చెయ్యటం లాటిది ఎంత మాత్రమూ కూడదు. దీన్ని వదిలించటాని కైనా కొంత డబ్బు ఖర్చు చేసుకోక తప్పదు. అంతకన్న మీరు మరో చోట ఇల్లు వేసు కోవటం మంచిది," అని సలహా యిచ్చి వెళ్ళిపోయాడు.

రంగమ్మకు ఏ దయ్యమన్నా భయమే. ఈ ఇంట్లో ఒక్క క్షణం ఉండననీ, తన చంటి పిల్లాడికి ఏమి ప్రమాదం జరిగినా జరగవచ్చుననీ ఆమె అన్నది. మర్నాడు సాయంకాలం లోపుగా రామయ్య కొత్త ఇల్లు కట్టించి, అందులోకి సామానంతా తరలించాడు. ఒక్క పెద్ద రోలు మాత్రం పాత ఇంట దిగబడి పోయింది. కొత్త ఇంట అడుగు పెట్టగానే రంగమ్మకు పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్టయింది.

ఆ రాత్రి రంగమ్మ హాయిగా నిద్ర పోయింది. మర్నాడు ఉదయం లేచి ఆమె దొడ్లోకి వెళ్ళేసరికి, పాత ఇంట తాము వదిలి వచ్చిన అంత పెద్ద రోలూ కొత్త దొడ్లో చక్కగా పెట్టి ఉన్నది! అంత ఉపకార బుద్ధి గల దయ్యాన్ని చూసి భయపడి నందుకు రంగమ్మ ఎంతో నొచ్చుకున్నది.

అయితే ఆ తరవాత ఆమెకు ఆ దయ్యం జాడ ఏమీ తెలియరాలేదు.






## 2

[శిఖిముఖి అనే శబరయువకు డొకడు అరణ్యానికి వేటకు వెళ్ళి, అక్కడ కవచం ధరించివున్న అశ్వికయోధు డొకడి మీద దొంగలు దాడి చేయటం చూసి, అతడికి సహాయం చేశాడు. ఆ యోధుడు తన పేరు విక్రమకేసరి అని చెప్పాడు. ఇద్దరూ కలిసి చీకటివేళ పల్లెను సమీపించేంతలో, పల్లెవాసులు వాళ్ళ కేసి పరిగెత్తుకు రాసాగారు. తరవాత—]

శిఖిముఖి తన కేసి వచ్చే పల్లెవాసుల్ని చూసి ఆశ్చర్యపడ్డాడు. వాళ్ళందరూ ఆయుధాలు ధరించి వున్నారు. ముందుగా అతణ్ణి సమీపించిన శబరులు అతడి చుట్టూ చేరి కేకలు వేస్తూ, పాటలు పాడసాగారు.

"ఈ గొడవంతా ఏమిటి? పల్లెపల్లెంతా కదిలినట్టుందే. ఏం జరిగింది?" అని అడిగాడు శిఖిముఖి, తన చుట్టూ చేరి గంతులు వేస్తున్నవాళ్ళను.

"అరణ్యంలో నిన్నూ, మరొక వింత మనిషినీ కొండదొంగలు చంపేశారని విని, పల్లె పెద్దతోపాటు అందరం బయలుదేరాం. అడవిలో గొడ్లను మేపే పల్లెపిల్లలు చెప్పింది అబద్ధం అయినా కావాలి, లేదా నువ్వూ, ఆ ఇనపమనిషీ కలిసి కొండ దొంగలను చంపయినా వుండాలి," అన్నారు వాళ్ళు.

శిఖిముఖి పెద్దగా నవ్వుతూ విక్రమ కేసరి దగ్గిరకుపోయి, "చూశావా! మా పిల్ల





శివాలుడు మరి కొందరితో కలిసి తన కొడుకున్న చోటుకు రాగానే, అప్పటివరకూ శిఖిముఖి చుట్టూ చేరి గడబిడ చేస్తున్న వాళ్ళందరూ పక్కకు తప్పుకున్నారు. శివాలుడు తన కొడుకును సమీపించి కౌగలించుకున్నాడు. అంతలో కాగడా వెలుగు పైన పడటంతో విక్రమకేసరి అతడి కంట బడ్డాడు.

శివాలుడు ఒక్క క్షణకాలం నిశ్చేష్టుడై పోయి, విక్రమకేసరిని కన్నార్పకుండా చూస్తూ, అతడి కేసి రెండడుగులు వేసి, "ఎవరూ, విక్రమకేసరి దొరా?" అన్నాడు ఆనందం ఆశ్చర్యం కనబరుస్తూ.

విక్రమకేసరి అతణ్ణి సమీపించి నమస్కరిస్తూ, "నేను విక్రమకేసరినే, కాని మీరు నన్నెరగరు," అన్నాడు.

శివాలుడు, విక్రమకేసరిని వింతగా చూస్తూ, "అవును, నలభైఏళ్ళనాటి మాట! ఆ దొరా నా వయసువాడే, ముసలివాడు కాకుండా ఎలా వుంటాడు? మేం యిద్దరం నీ వయసువాళ్ళమై వుండగా చక్రవర్తి సేనలో చేరి ఉత్తరాన బ్రహ్మపుత్రానదీ లోయల వరకూ జైత్రయాత్ర చేసి, చక్రవర్తికి అంతులేని ధనం, కీర్తి సంపాయించి పెట్టాం. ఇంతకూ నీవెవరు? మళ్ళి ఆనాటి

కారు వెధవలు గోరంతదాన్ని కొండంత ఎలా చేస్తారో. మనం దొంగల చేతిలో చచ్చిపోయామనే, వాళ్ళు పల్లెకుపోయి చెప్పారట. నీకు వాళ్ళు పెట్టిన పేరు ఇనప మనిషి," అన్నాడు.

విక్రమకేసరి కిదంతా మంచి వినోదంగా వున్నది. పల్లెవాసుల ఐకమత్యానికీ, తమ నాయకుడి కుమారుడంటే వాళ్ళకున్న వాత్సల్యాభిమానాలకూ అతడు చాలా సంతోషపడ్డాడు. తన తండ్రి తలపెట్టిన సాహసకార్యానికి నిజంగా తోడ్పడగలవాళ్ళు యీ శబరులన్న నమ్మకం అతడికా క్షణంలో కలిగింది.





దొర విక్రమకేసరినే చూశానని భ్రమ పడ్డాను," అన్నాడు.

"నేనా విక్రమకేసరి మనవడిని. నా పేరూ విక్రమకేసరే. నా తండ్రిగారు మీతో కొన్ని ముఖ్య విషయాలు మాట్లాడేందుకు నన్ను పంపారు," అన్నాడు విక్రమకేసరి.



"ఆశ్చర్యంగా వుంది. మీ తాతగారు చనిపోయారని కూడా విన్నాను. అయినా, నీ రూపం నన్ను భ్రమింపజేసింది. మీ నాన్నగారు జయపాలుడు క్షేమమా? ఈ శబరుణ్ణి ఆయన గుర్తుపెట్టుకోవటమే గాక, తన కుమారుణ్ణి ఒక ముఖ్య విషయం మాట్లాడేందుకు పంపటం, నాకు అబ్బురం కలిగిస్తున్నది. సంస్థానాధీశులైన మీ తండ్రిగారు యీ శబర పల్లెపెద్దతో సంప్రతించవలసిన అంత గొప్ప విషయం ఏమిటి?" అని అడిగాడు శివాలుడు.

"అదంతా మీ పల్లె చేరిం తరవాత చెపుతాను. నన్ను మీ పల్లె చేరకుండా అటకాయించేందుకు కొందరు దుర్మార్గులు అరణ్యంలో చాలా పెద్ద ప్రయత్నం చేశారు," అన్నాడు విక్రమకేసరి.

"ఆ సంగతి తెలిసే మేమంతా అరణ్యానికి బయలుదేరాం. శిఖిముఖి వెంట వున్నది, నా పూర్వ యజమాని మనవడని మాత్రం నాకు తెలియదు. ఎవరో ఇనపమనిషి అంటూ పిల్లలు చెప్పారు. సరే, ఇద్దరూ క్షేమంగా బయటపడ్డారు. పల్లెకుపోదాం పదండి," అన్నాడు శివాలుడు.

అరగంట తరవాత అందరూ పల్లె చేరే సరికి, శివాలుడి ఇంటిదాపున చాలామంది ఆడవాళ్ళు గుంపుగా చేరి గొడవగా మాట్లాడుకుంటున్నారు. వాళ్ళందరి చేతుల్లోనూ నీళ్ళ కడవలున్నాయి. శివాలుడూ, అతడి వెంట వున్న పల్లెవాసులూ అడిగిన మీదట, తాము నీరు తెచ్చుకునేందుకు కొలనుకెళ్ళామనీ, అక్కడ కొందరు కొత్తవాళ్ళు






కనిపించి, శివాలుడి యిల్లెక్కడ అని అడిగారనీ చెప్పారు. వాళ్ళు చూడటానికి దారిదోపిడిగాళ్ళలా వున్నారనీ, అందరి చేతుల్లోనూ ఆయుధాలున్నవనీ కూడా చెప్పారు.

ఒకటికి రెండుసార్లు ప్రశ్నించిన మీదట ఆడవాళ్ళు ఆ కొత్తవాళ్ళు ధరించిన దుస్తుల తీరూ అదీ వర్ణించారు. వాళ్ళు చెప్పిందానికీ, అరణ్యంలో గొడ్లకాచే పల్లెపిల్లలు దొంగల్ని గురించి చెప్పిందానికీ సరిపోయింది. శివాలుడు అక్కడ ఎవరితోనూ ఏమీ అనక, తన ఇల్లు చేరగానే విక్రమకేసరితో, "ఆ దొంగలెవరో కాని గొప్ప సాహసికులుగా వున్నారు. తా మెరగని ప్రాంతాలకు వచ్చి, శబర పల్లెపెద్ద ఇంటి మీదే దాడిచేయాలని చూస్తున్నట్టు కనబడుతున్నది. ఎంత ధైర్యం!" అన్నాడు.

"వాళ్ళు ఒక వేళ యీ ఇంటి మీదికి దాడివస్తే, మీ కోసంకాదు, నా కోసం. నేనూ, శిఖిముఖీ కలిసి పల్లె కేసి బయలుదేరటం వాళ్ళు చూసివుంటారు. వాళ్ళక్కావలసింది నా ప్రాణం కన్న యీ సంచీలో వున్న వస్తువులు," అంటూ విక్రమకేసరి గుర్రంజీను నుంచి వేలాడుతున్న సంచీ విప్పి, శివాలుడికి అందించాడు.

శివాలుడు ఆ సంచిని భద్రంగా గదికి ఒక మూలవున్న కులదేవతల విగ్రహాల ముందుపెట్టి, "రాత్రి చాలావుంది, అంతా తీరిగ్గా మాట్లాడుకోవచ్చు. ముందు తిండీ తిప్పల సంగతి చూద్దాం," అన్నాడు.

ఆ తరవాత అందరూ రకరకాల మాంసాలతో, పానీయాలతో తృప్తిగా భోజనం చేశారు. శివాలుడు గోడకానుకుని కూర్చుని గుడుగుడులో పొగాకు తుంపివేసి, నిప్పంటించి పొగపీలుస్తూ, ఎదురుగా గొంగళ్ళు పరిచిన చాప మీద కూర్చుని వున్న విక్రమకేసరీ, శిఖిముఖుల కేసి చిరునవ్వు నవ్వుతూ చూసి, "మీ ఇద్దర్నీ పక్కపక్కల చూస్తూంటే, నాకు విక్రమకేసరి దొర గుర్తు



కొస్తున్నాడు. ఆయన మనవడు ఒకానొక రోజు నా ఇంటికొచ్చి అతిథిగా వుండబోతాడని నే నేనాడూ ఊహించలేదు," అన్నాడు.

"నా తండ్రిగారు కూడా నేను శూర దేశం నుంచి యింత దూరం ప్రయాణం చేయవలసి వస్తుందని కలలో కూడా అనుకుని వుండడు. ఆయన మా తాతగార్ని గురించీ, మిమ్మల్ని గురించీ చాలా అద్భుత విషయాలు చెపుతూండేవాడు. కాని....మీకు యిప్పటివరకూ తెలియని సంగ తొకటి చెపుతాను. మా తాతగారు విక్రమకేసరి ఇప్పటికి ఇరవై సంవత్సరాల క్రితం తిరిగి మరొకసారి బ్రహ్మపుత్రానదీ ప్రాంతాలవున్న



కామాఖ్య నగరం కేసి వెళ్ళాడు. ఇంత కాలమైనా తిరిగి రాలేదు. చనిపోయి వుంటాడనుకున్నాం. ఇప్పటికి రెండు నెలల క్రితం అందిన వర్తమానాన్ని బట్టి, ఆయన యింకా సజీవుడేమో అన్న అనుమానం కలుగుతున్నది," అన్నాడు విక్రమకేసరి.

ఆ మాటలు వింటూనే శివాలుడు ఆశ్చర్యపడుతూ విక్రమకేసరి కేసి తేరిపార చూసి, "కేసరిదొర మరొకసారి ఆ బ్రహ్మపుత్రానదీ ప్రాంతాల్లోని అరణ్యాల కేసి వెళ్ళారా? ఇది జరిగి ఇరవై ఏళ్ళయి వుంటే—మాటమాత్రంగా మనిషితో కబురు పెట్టివుంటే నేనూ ఆయన వెంట బయలుదేరేవాణ్ణి. ఇంతకూ ఆ దొర మళ్ళీ అంతదూరం ఎందుకెళ్ళినట్టు?" అని ప్రశ్నించాడు.

"అదేదో చాలా నిగూఢ రహస్యం అనీ, తాను చచ్చేలోపల సాధించి తీరవలసిన కార్యమనీ, మా తండ్రిగారితో చెప్పారట. అంతకన్న వివరాలేమీ చెప్పలేదు. కాని, రెండు నెల్లక్రితం మా సంస్థానం వాడే అయిన ఒక పండితుడు ఆ ఉత్తర దేశాన్నుంచి తిరిగి వచ్చి, మా తాతగారి వస్తువులంటూ కొన్ని మా నాయనగారికి ఒప్పచెప్పాడు. వాటిలో ఎక్కువ భాగం







తాళపత్ర గ్రంథాలు. అతడు చెప్పేదాన్ని బట్టి మా తాతగారు అక్కడి కొండల్లో ఎక్కడో సన్యాసిగా జీవిస్తున్నాడని తెలుస్తున్నది. అయినా అందుకు గట్టి రుజువేమీ లేదు," అన్నాడు విక్రమకేసరి.

శివాలుడు కొంచెంసేపు తల వంచుకు ఆలోచిస్తూ వూరుకుని, "నువు చెప్పేది వింటూంటే నాకు మతిపోతున్నట్టుగా వున్నది. ఆ దొర మళ్ళీ ఆ ఘోరారణ్య ప్రాంతాలకు ఎందుకెళ్ళాడు? ఆ నిగూఢ రహస్యం ఏమిటి? ఆయన వస్తువులు మీ సంస్థాన పండితుడి కెలా దొరికినై?" అని అడిగాడు. విక్రమకేసరి పండితుడు చెప్పిన దంతా శివాలుడికి కొద్దిమాటల్లో చెప్పేశాడు:

ఆ పండితుడు బాల్యంలోనే ఇల్లు విడిచి నానా దేశాలూ తిరిగి, శాస్త్రవిద్యలన్నీ నేర్చుకుని వృద్ధాప్యంలో తిరిగి ఇంటికి చేరాడు. ఆయన బ్రహ్మపుత్రానదీ ప్రాంతాల్లోని అరణ్య ప్రదేశాల్లో చాలాకాలం నివశించాడు. అక్కడ వుండే ఆటవికులకు రోగాలూ రొప్పులూ వస్తే మందుమాకు ఇచ్చి సహాయపడ్డాడు. ఆ ఆటవికుల్లో అనేక జాతులవాళ్ళూ, భాషలవాళ్ళూ వున్నారట. వాళ్ళల్లో ఇభ్యు లనే ఏనుగులను మచ్చిక చేసే జాతివాళ్ళు, ఆ పండితుడి జన్మదేశం అవీ తెలుసుకుని, తమ పల్లెలో విక్రమకేసరి అనే క్షత్రియుడు కొంతకాలం తన నౌకరుతో నివశించాడనీ, అతడికి మన్నె జ్వరం రాగా అడవికి మూలికల కోసం పోయినప్పుడు పులి ఎత్తుకుపోయిందనీ చెప్పారట. ఆయనకు సంబంధించినవే అంటూ కొన్ని తాళపత్రగ్రంథాలూ, చిన్న కత్తి వగైరా ఆ పండితుడికి ఒప్పచెప్పారు. కాని, ఆయన ఆ అరణ్యంలో మరొక ప్రాంతానికి వెళ్ళినప్పుడు, విక్రమకేసరి అన్న పేరుగల సుక్షత్రియు డొకడు అఘోరీ లనే సన్యాసులతో కొండల్లో నివశిస్తున్నట్టు మరికొందరు చెప్పారట. ఆ పండితుడు

ఆ సన్యాసుల్లో చాలామందితో మాట్లాడి చూశాడు. కాని, ఉన్మాదనటమే తప్ప మా తాతగారు ఎక్కడ వున్నదీ వాళ్ళల్లో ఏ ఒక్కడూ చెప్పలేకపోయాడు. ఇదంతా విన్న మీదట మా నాయనగారు, మా తాత గారి వస్తువులనబడే వాటినన్నిటినీ యీ సంచీలో పెట్టి మిమ్మల్ని కలుసుకుని మాట్లాడితే ప్రయోజనం వుంటుందేమో అని నన్నిక్కడికి పంపారు. సంచీలో వున్న తాళ పత్ర గ్రంథాల్లో కొన్ని మా తాతగారు స్వహస్తంతో రాసినవి. అవి చదివితే మీకు ఆయన ఏ నిగూఢ రహస్యాన్ని భేదించేందుకు ఆ ప్రాంతాలకు వెళ్ళాడో తెలియవచ్చు. అంతేకాక వాటిద్వారా మీరు ఆయన సజీవుడో కాదో కూడా గ్రహించగలరని మా తండ్రిగారు ఆశపడుతున్నారు.

విక్రమకేసరి చెప్పినదంతా శ్రద్ధగా విన్న శివాలుడు కొద్దిసేపు మౌనంగా వూరుకుని, హఠాత్తుగా ఏదో జ్ఞప్తికి వచ్చినవాడిలా తుళ్ళిపడి, "బహుశా, కేసరిదొర నిగూఢ రహస్యం అనేది శిథిలాలయానికి సంబంధించినదికాదు గదా? ఒకవేళ అదే అయితే, ఆ ఆలయాన్ని చేరటంకన్న హిమాలయాల్లోని కైలాసగిరి శిఖరం ఎక్కటం తేలిక. శిఖీ, ఆ సంచీ యిటు తీసుకురా," అని తన కొడుకును హెచ్చరించాడు.

శిఖిముఖి లేచి కులదేవతల విగ్రహాల ముందున్న సంచీ తీసుకుని తండ్రి దగ్గిరకు వచ్చి, దాన్ని అతడి చేతికి అందించబోయాడు. ఇంతలో వీధి వైపుకువున్న తలుపును చీకటి కమ్మినట్టయింది. నల్లని దుస్తులు ధరించిన ఒక వ్యక్తి--ఆరున్నర ఏడడుగుల పొడవుగల మరీ బక్కపలచని వాడు, తల మీద గుడ్లగూబ ఆకారంలో వున్న శిరస్త్రాణం ధరించి—వాళ్ళముందు ప్రత్యక్షమయాడు. శివాలుడూ, శిఖిముఖీ, విక్రమకేసరీ ఆ వికృతాకారాన్ని చూస్తూనే నిర్విణ్ణులయారు. —(ఇంకా వుంది)





# ఘోరపరాజయం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీవు ఎవరికైనా కీడు తలపెట్టి ఇలా శ్రమపడటం లేదు గద! అలా చేసిన పక్షంలో ఘూర్జరదేశపు చక్రవర్తి అయిన శూరసేనుడి లాగే ఘోర పరాజయాన్ని కోరి తెచ్చుకున్న వాడివి కావచ్చు. శ్రమతెలియకుండా ఉండగలందులకు నీకు శూరసేనుడి కథ చెబుతాను విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం ఘూర్జరదేశానికి శూరసేనుడు సార్వభౌముడుగా ఉండిన కాలంలో, అతని కింద అనేకమంది సామంతరాజులుండి, ఒక్కొక్కడూ ఒక్కొక్క నగరాన్ని ఏలుతూ ఉండేవాడు. వారిలో సుందరపురాన్ని ఏలే శక్తిమంతుడు ఒకడు.

## బేతాళ కథలు



శక్తిమంతుడు రాజ్యపాలన విషయంలో ఆదర్శప్రాయుడు. ప్రజారంజకంగా పాలించటమూ, ప్రజల సమస్యలను పరిష్కరించటమూ, ప్రజల అభిమానాన్ని చూరగొనటమూ అతనికి తెలిసినట్టు మరెవ్వరికీ తెలియదు. అందుచేత సుందరపురం శాంతి సౌభాగ్యాలకు పెట్టినది పేరయింది. శక్తిమంతుడి సామర్థ్యాన్ని దేశంలోని రాజులందరూ మెచ్చుకునేవారు.

తన కింది సామంతరాజైన శక్తిమంతుడి కీర్తి గురించి శూరసేనుడు రోజురోజూ వింటూ వచ్చాడు. అతని ఖ్యాతి తన ఖ్యాతిని మించిపోతుందని మొదట్లో ఆయన ఈర్ష్య పడ్డాడు. కొంత కాలం గడిచాక సార్వభౌముడికి, ఎప్పటికైనా శక్తిమంతుడు తన సార్వభౌమత్వానికే ఎసరు పెడతాడన్న భయం కూడా పట్టుకున్నది. సాధ్యమైనంత త్వరలో శక్తిమంతుణ్ణి నిర్మూలించడం అవసరమని శూరసేనుడికి తోచింది. ఆయన ఎవరికీ తెలియకుండా తన సేనను ఆయత్తపరిచి వెళ్ళి, సుందరపురాన్ని ముట్టడించి, శక్తిమంతుడి పైన యుద్ధం ప్రకటించాడు.

తన వద్దకు యుద్ధప్రకటన తెచ్చిన శూరసేనుడి దూత ద్వారా శక్తిమంతుడు ఈ విధంగా సందేశం పంపించాడు :

"నేను తమరి సామంతుణ్ణి. నా పైన తమరు యుద్ధం చెయ్యడం దేనికి? తమ పక్షానే నేను సుందరపురాన్ని పరిపాలిస్తున్నాను. నా వల్ల ఏదైనా అపచారం జరిగి ఉంటే తెలపండి, తప్పు దిద్దుకుంటాను."

ఈ మాటకు శూరసేనుడు చలించలేదు. "నీవు నీ ప్రజలను మోసంతో కూడగట్టుకుని, వారికి మా పట్ల గౌరవాదరాలు లేకుండా చేశావు. నిన్ను యుద్ధంలో ఓడించి నీ రాజ్యాన్ని నా అధీనం చేసుకోక మానను," అని శూరసేనుడు తిరిగి కబురు చేశాడు.

యుద్ధం జరగకుండా చూడటానికి శక్తిమంతుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు.



కాని అన్నీ విఫలమయాయి. ఈ సంగతి సుందరపుర పౌరులందరికీ తెలుసును. వాళ్ళు తమ రాజు కోసం ప్రాణాలర్పించ టానికి సిద్ధపడ్డారు.

దానికి తోడు చక్రవర్తి సైనికులు పట్టు దలగా యుద్ధం చెయ్యలేదు. చక్రవర్తి మూర్ఖుడై ఈ యుద్ధం తెచ్చిపెట్టాడని వారికి తోచింది. అందుచేత సైన్యంలో అరాజక పరిస్థితి ఏర్పడింది.

యుద్ధంలో శక్తిమంతుడి ఓటమి అబద్ధమూ, తన ఓటమి నిజమూ అని తోచ గానే శూరసేనుడు తన సామంతులకు, సేనలతో తనకు సహాయం రమ్మని వర్త మానాలు పంపాడు. ఒకడు వారంరోజులు గడువడిగాడు, మరొకడు నెలరోజులు గడు వడిగాడు. అందరూ తలా ఒక సాకూ చెప్పారు. ఒక్కడు కూడా చక్రవర్తికి సహాయం రాలేదు.

చివరకు శూరసేనుడు శక్తిమంతుణ్ణి సంధికి పిలిచి, "మిత్రమా, శక్తిమంతా, నీ బలపరాక్రమాలను గురించి అందరూ గొప్పగా చెబుతూంటే విని, వాటిని పరీక్ష చెయ్యటానికి వచ్చాను. కాని మరొకటి కాదు. మనం ఎప్పటికీ మిత్రులమే. నీ రాజ్యాన్ని నువు నిరాక్షేపణగా ఏలుకో!"



అంటూ తన మిగిలిన సైన్యాన్ని తీసుకుని తన రాజధానికి తిరిగిపోయాడు.

ఈ వార్త విన్నాక సామంతులకు తమ చక్రవర్తి మీద అసహ్యం పుట్టుకొచ్చింది.

"ఈ శూరసేనుడు పరమ నీచుడు. నీచుడు కనకనే తన సామంతుడి పైకి ఎత్తివెళ్ళాడు. వెళ్ళినవాడు పౌరుషంగా గెలవలేక, సంధి చేసుకుని, ఓడిపోయి తిరిగి వచ్చాడు. సామంతుడి చేతిలో ఓడిపోయిన వాణ్ణి మనం చక్రవర్తిగా ఎలా ఉంచు కుంటాం? ఇవాళ శక్తిమంతుడి పైకి వెళ్ళిన వాడు రేపు మనలో ఎవరిపైకి వచ్చినా రావచ్చు. అందుచేత ఈ శూరసేనుణ్ణి

పదవిభ్రష్టుణ్ణి చేసిన దాకా మనం నిద్ర పోరాదు," అని తీర్మానించుకుని, సామంతు లందరూ తమ సేనలను కలుపుకుని, శూర సేనుడి పైకి వెళ్ళి, అతన్ని ఓడించి, అడవు లకు పంపేసి, అతని స్థానంలో శక్తిమంతుణ్ణి చక్రవర్తిగా ప్రతిష్ఠ చేశారు.

శక్తిమంతుడు తనకు సార్వభౌమత్వం అవసరం లేదని చెప్పి, అందరితోనూ స్నేహ ప్రమాణాలు చేసుకుని, అందరూ స్వతంత్ర రాజులే నని ప్రకటించాడు.

బేతాళు డీ కథ చెప్పి, "రాజా, శూర సేనుడు పతనం కావటానికి ఈర్ష్య కదా కారణం? శక్తిమంతుడు, తాను చక్ర వర్తికి లోబడి పాలిస్తున్నానని చెప్పినప్పుడు తృప్తిపడక, అతనితో యుద్ధం చేసి, తన చేతి కొరివితో తన తలనే ఎందుకు గోక్కున్నాడు? శక్తిమంతుడు తన స్థానం ఆక్రమిస్తాడేమో నని భయపడి, అందుకు అనుకూలమైన చర్యలు తానే ఎందుకు చేశాడు? ఈ ప్రశ్నలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శూరసేనుడి ప్రవర్తనకు కేవలమూ ఈర్ష్య కారణం కాదు. శక్తిమంతుడు తన కన్న సమర్థుడని ఎప్పు డైతే తెలిసిందో అప్పుడే అతని వల్ల తన స్థానానికి ప్రమాదం ఉన్నదని కూడా శూరసేనుడు తెలుసుకున్నాడు. ఆ ప్రమాదం రాకుండా చేసుకోవాలంటే చక్రవర్తి శక్తి మంతుడి కన్న సమర్థుడైన ఏలిక కావాలి. అది శూరసేనుడికి సాధ్యం కాదు. అందు చేత శక్తిమంతుణ్ణి నాశనం చెయ్యటం తప్ప చక్రవర్తికి మరొక మార్గం లేదు. అందులో ఓడిపోవడమే అతని పతనానికి కారణం," అన్నాడు.

రాజుకీ విధంగా మౌనభంగం కలగ గానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# దొంగల నాయకుడు

పూర్వం వింధ్యపర్వతాలలో ఒక దొంగల ముఠా ఉండేది. వాళ్ళ నాయకుడు పెద్ద వాడై, పక్షవాతం వచ్చి, అవసానదశ చేరు కున్నాడు. అప్పుడతను తన కింద ఉన్న వారిని పిలిచి, "నేను త్వరలోనే చచ్చి పోతాను. అందుచేత మీరు మరొక నాయ కుణ్ణి ఎన్నుకోవలసి ఉంటుంది. నా జీవి తంలో నేను ఎన్నో రకాల దొంగతనాలు చేసి, ఎంతో సాహసమూ, యుక్తీ కనబరి చాను. కాని, ఎంత ప్రయత్నించి కూడా మూడు దొంగతనాలు చేయలేక పోయాను. మీలో ఎవడు వాటిని చెయ్యగలుగుతాడో వాడు మీకు నాయకుడుగా ఉండదగినవాడు. ఆ మూడు దొంగతనాలూ ఏమంటే: గొల్ల గోపయ్య మందలో గొర్రెలను కాజెయ్యటం; మునసబు నాగరాజుగారి చెమ్మ్కిచెప్పుల జత దొంగిలించటం; రాజుగారు ధరించే నక్షత్రమాలను అపహరించటం. ఈ మూడు పనులూ నాకు సాధ్యం కాలేదు. ఈ మూటినీ దొంగిలించినవాణ్ణి మీరు నాయ కుడుగా పెట్టుకోండి," అని చెప్పి, కొద్ది కాలానికే ప్రాణాలు వదిలాడు.

దొంగలముఠాలో ధైర్యసాహసా లున్న యువకులు కొందరున్నారు. వారంతా కూడా ఈ మూడు దొంగతనాలూ చెయ్య టానికి విశ్వప్రయత్నాలు సాగించారు. వారిలో భూపతి అనే మంచి తెలివి తేటలున్న యువకు డొకడున్నాడు.

భూపతి మొట్టమొదటగా గొల్లగోపయ్య మందల మీద పట్టించాడు. మూడురోజులు గోపయ్య దినచర్య శ్రద్ధగా గమనించి భూపతి ఒక వింత విషయం తెలుసుకున్నాడు: గోపయ్య తన గొర్రెలమందకు అహెూ రాత్రాలు కాపలా కాస్తాడు! ఉదయమే మందను తోలుకుని బీళ్ళ మీద మేపుతాడు. రాత్రల్లా వాటని చావట్లో ఉంచి, వాటి

కొవల్లి రామారావు



మధ్య, గడ్డం కింద చేతి కఱ్ఱ బోటు పెట్టు కుని నిలబడి కాపలా కాస్తాడు.

గోపయ్య ఎప్పుడు నిద్రపోతాడు? అహో రాత్రాలు గొర్రెలకు కాపలా ఉంటే దొంగ తనం ఎప్పుడు చేసేటట్టు?

ఇందులో ఉన్న కిటు కేమిటో భూపతికి అర్థం కాలేదు. వాడు ఒకనాడు గోపయ్య ఇంటికి వెళ్ళి, అతని భార్యతో, "ఏవమ్మోయ్, మీ గొర్రెలను ఎవరో దొంగతనం చేశారు," అని చెప్పాడు.

"ఈ పిచ్చిచచ్చినాడు, గడ్డం కఱ్ఱ మీద ఆనించి నిలబడి గొడ్డు నిద్దరబోతాడు. ఆ సంగతి దొంగకు తెలిసింది గామాలు. ఇక దొంగతనం ఎందుకు జరగదు!" అన్నది గోపయ్య భార్య.

ఆ రాత్రే భూపతి గోపయ్య మందలో గొర్రెలను నాలుగింటిని తోలుకుని మిగిలిన దొంగల దగ్గిరికి పోయి, "ఇవి గోపయ్య గొర్రెలు. మళ్ళీ పోతున్నాను. ఈ సారి మునసబు నాగరాజుగారి చెమ్మ్కి చెప్పులతో గాని రాను," అన్నాడు.

మునసబు నాగరాజు తరుచు అడివి దాటి బస్తీకి పోతూంటాడు. ఆయన నాగ దేవత భక్తుడు. ఈ రెండు విషయాలూ తెలుసుకుని భూపతి తన పథకం నిర్ణ యించుకున్నాడు.

బస్తీకి అడివి కుండా వెళ్ళే దారి పక్కన ఒక చోట ఒక పుట్ట ఉన్నది. భూపతి దాని చుట్టూ కంచె ఏర్పాటు చేసి, ఆ ఆవరణ లోకి దారి వదిలిపెట్టి పుట్ట నిండా పూలు చల్లాడు. అది మొదలు ప్రతి రోజూ వాడు ఆ పుట్ట మీద పసుపూ, కుంకమూ, గంధమూ, పూలూ చల్లుతూ, అక్కడికి రోజూ జనం వచ్చి పూజ చేసి పోతున్నట్టుగా కనబడేలాగా చేస్తూ వచ్చాడు.

ఒక వారం గడిచింది. మునసబు నాగ రాజుకు బస్తీకి వెళ్ళవలిసిన పని తగిలింది. ఆయన చెమ్మ్కి చెప్పులు తొడుక్కుని అడవి

దారిన పోతూ పుట్ట ఉన్న చోటికి వస్తూనే ఆగి, లోపలికి తొంగి చూశాడు. అక్కడ చాలా రోజులుగా నాగపూజ జరుగుతున్నట్టు స్పష్టంగా కనబడింది. నాగరాజు నాగ భక్తుడు కావటం చేత, దగ్గిర ఉన్న అడివి పూలు దోసెడు కోసి, చెప్పులను కంచె దగ్గిర వదిలి, లోపలికి వెళ్ళి, నాగదేవతను ధ్యానం చేస్తూ పూలు చల్లాడు.

పక్క నున్న పొదల్లోనే నక్కి ఉన్న భూపతి మునసబుగారి చెమ్కీ చెప్పులను సంగ్రహించి, అడివికి అడ్డం పడి వెళ్ళి దొంగలముఠాను చేరుకుని, "ఇవి మునసబు నాగరాజుగారి చెమ్కీ చెప్పులు. ఈసారి రాజుగారి నక్షత్రమాలతో మీకు కనిపిస్తాను," అన్నాడు.

భూపతి తిన్నగా రాజధానికి వెళ్ళి రాజుగారి నక్షత్రమాల తస్కరించటానికి అనేక రకాల ఎత్తులు ఆలోచించాడు. రాజుగారికి ముగ్గురు కుమార్తెలున్నారు గాని మగ పిల్లలు లేరు. ఈ విషయం ఆధారం చేసుకుని నక్షత్రమాల హరించటానికి భూపతి ఒక ఎత్తు వేశాడు.

వాడు మూడు మాసాలపాటు బైరాగులతో తిరిగి, గడ్డమూ, మీసాలూ, జుట్టూ పెంచాడు; వాళ్ళ వేషభాషలన్నీ గమనించాడు. తాను కూడా ఒక జింకచర్మం చంకన పెట్టుకుని రాజభవనానికి వెళ్ళి, "బదరీఆశ్రమం నుంచి వస్తున్నాం. రాజుగారిని దీవించి పోవాలని వచ్చాం," అని కబురు చేశాడు.



రాజు భూపతికి దర్శనం ఇచ్చాడు. రాజు మెడలో నక్షత్రమాల ఉన్నది. అది సులువుగా లక్ష చేస్తుంది. భూపతి చెయ్యెత్తి రాజును ఆశీర్వదించి, "మీ కుమాళ్ళెక్కడ? వారిని కూడా దీవించి వెళ్ళి పోతాం!" అన్నాడు. రాజుముఖం సిగ్గుతో జేవురించింది.

"నాకు కుమార్తెలే ఉన్నారు. ఇంకా కుమాళ్ళు కలగలేదు," అన్నాడాయన.

భూపతి ఆశ్చర్యం అభినయిస్తూ, "ఈ నక్షత్రమాల ధరించిన వారికి పుత్ర సంతతి కలిగి తీరవలెనే!" అన్నాడు.

రాజుకు ఆ సంగతి లోగడ ఎంత గొప్ప జ్యోతిష్కులూ చెప్పలేదు. నిజాని కది భూపతి కల్పన. రాజు ఈ మాట విని ఆశ్చర్యపోయాడు.

"ఏదీ? ఆహారం ఒకసారి చూడ నివ్వండి," అని భూపతి రాజు మెడలో ఉన్న నక్షత్రహారాన్ని తీసుకుని, దాన్ని శ్రద్ధగా పరీక్షించినట్టు అభినయించి, "అను కున్నంతా అయింది. దీని చేతలో కొన్ని తప్పులున్నాయి. వీటిని రాత్రి పూట నక్షత్ర కాంతిలో పరీక్షించి, అవసరమైన మార్పులు చెబుతాను. ఆ తరవాత మీకు మగ సంతానం తప్పక కలుగుతుంది, కలిగి తీరవలె!" అన్నాడు.

ఆ రాత్రి భూపతిని రాజభవనంలోనే ఉంచారు. భూపతి హారాన్ని తెల్లవార్లూ నక్షత్రకాంతిలో పరీక్షిస్తూ, "ఇంకా రేవతి ఉదయించ లేదు. ఇంకా రోహిణి ఉద యించలేదు," అంటూ కాలయాపన చేస్తు న్నాడు. నక్షత్ర పరీక్ష జరిగేటప్పుడు అక్కడే ఉన్న రాజోద్యోగులందరూ నిద్రకు జోగ సాగారు. మూడో జాములో అందరూ నిద్ర మత్తులో ఉన్న సమయంలో భూపతి చల్లగా రాజభవనం దాటి హారంతో సహా మాయమయాడు.

భూపతి నక్షత్రహారాన్ని తీసుకు రాగానే దొంగలముఠా వాణ్ణి తమ నాయకుడు చేసు కున్నారు. అయితే రాజు భూపతి చేసిన పనిని మెచ్చుకుని, అతనికి పెద్ద ఉద్యోగ మిస్తానని చాటింపు వేయించాడు. భూపతి తన దొంగలందరినీ వెంట బెట్టుకుని రాజధానీనగరానికి వచ్చి, రాజుగారి కొలు వులో ప్రవేశించి, దేశంలో దొంగలందరికీ సింహస్వప్నమై, ప్రజలకు దొంగల బాధ అనేది లేకుండా చేశాడు.






# మూడు ప్రశ్నలు

పూర్వం అవధదేశపు రాజుకు ఒక అందాల రాశి అయిన కుమార్తె ఉండేది. అపూర్వమైన ఆమె సౌందర్యం గురించి విని ఎక్కడెక్కడి దేశాల రాజకుమారులూ ఆమెను వివాహ మాడాలన్న కోరికతో వచ్చేవారు. ఆమె వారితో ప్రసంగించి, తనకు తోచిన ప్రశ్నలేవో అడిగి, వారు చెప్పే సమాధానాలు విని, పంపేస్తూ ఉండేది. ఆమె ఏమి అడుగుతుందో ముందుగా ఎవరికీ తెలీదు. ఆమె అడిగే ప్రశ్నలకు కొందరు సరిఅయిన సమాధానాలే ఇచ్చా మనుకునేవారు; కొందరు తెలివిగా సమాధానాలిచ్చా మనుకునేవారు. ఏమైనా, ఆమె ఎవరినీ వివాహ మాడలేదు.

ఈ రాజకుమార్తెను గురించి కాశీరాజు కొడుకు విన్నాడు. అతనికి కూడా ఆమెను పెళ్ళాడ బుద్ధి అయింది. అతను తన రాజధాని నుంచి బయలుదేరి నదులూ, కొండలూ దాటుతూ, అవధీనగరానికి అతి ప్రయాసతో ప్రయాణం చేశాడు.

దారిలో అతనికి ఒక అడవి తగిలింది. ఆ అడవిలో అతనికి ఆకలి అయింది. అతను ఒక చిన్న జింకపిల్లను కొట్టాడు. దాన్ని కాల్చుకు తిందామని చితుకులు పేర్చి నిప్పు చెయ్యటానికి ప్రయత్నిస్తే గాలి బయలుదేరి నిప్పును ఆర్పేసింది. అంతకంతకూ గాలి తీవ్రత హెచ్చిపోవటం వల్ల అతను తిండి ఆశ వదులుకున్నాడు.

ఇంతలోనే గాలికి చెట్లు రాచుకుని అడివిలో అగ్గి పుట్టుకొచ్చింది. గాలి సహాయంతోనే అది అతిత్వరగా అరణ్యమంతా వ్యాపించింది. ఆ కార్చిచ్చు నుంచి రాజకుమారుడు బయటపడే సరికి తలప్రాణం తోకకు వచ్చినట్టయింది.

అతను చీకటిపడే వేళకు అడవి అవతల ఉన్న మైదానపు భూములు చేరుకున్నాడు.

జి. ఏరారెడ్డి

ఆకలి దహించుకు పోతున్నది. కొద్ది దూరంలో అతని కొక పూరిగుడిసె కన బడింది. ఆ గుడిసె వెలుపల ఒక స్త్రీ రాళ్ళ పొయ్యి పెట్టి, దాని మీద ఒక కుండలో గంజి కాస్తున్నది. ఆ గంజి కోసం ఏడెనిమిది మంది పిల్లలు కాచుకుని ఉన్నారు. రాజ కుమారుడు ఆ స్త్రీని చూసి, "రోజల్లా తిండి లేదు. ఆకలిబాధ తీరే ఉపాయం ఏదన్నా చేస్తావా?" అని అడిగాడు.

"కొంచెం ఆగు, నాయనా! మాతోపాటు ఈ గంజే తాగుదువుగాని!" అన్నదా స్త్రీ.

తరవాత కుండలో ఉన్న గంజిని ఆమె రాజకుమారుడికి కడుపునిండా పెట్టింది. మిగిలినది ఆమె బిడ్డలకు చాలలేదు. ఆమెకు ఒక్క చుక్క కూడా మిగలలేదు.

"రేప్పొద్దున కడుపునిండా తిందురు గాని, ఈ పూటకు పడుకోండి," అని ఆ స్త్రీ తన పిల్లలకు చెప్పింది.

ఆమె స్థితి చూసి రాజకుమారుడి హృదయం ద్రవించింది. అతను ఆ రాత్రి ఆ గుడిసెలోనే గడిపి, మర్నాడు వచ్చేస్తూ ఆ స్త్రీకి తన వద్ద ఉన్న డబ్బంతా ఇచ్చేశాడు.

తరవాత అతను క్షేమంగానే అవధీనగరం ప్రవేశించాడు.

రాజకుమార్తె అతనితో మామూలుగా చాలాసేపు మాట్లాడి, అతని పుట్టు



పూర్వోత్తరా లన్నీ తెలుసుకున్నది. తరవాత, మాటల సందర్భంలో ఆమె అతనితో, "సముద్రంలో బడబాగ్ని ఎలా ఉండగలుగుతున్నది?" అని అడిగింది.

రాజకుమారుడు ఆమెకు, పూరిగుడిసెలో తనకు గంజిపోసిన పేదరాలి వృత్తాంతం చెప్పి, "దారిద్ర్య బాధ ఆ మనిషి హృదయంలో ఉన్నట్టే, బడబాగ్ని కూడా సముద్రంలో ఉండగలుగుతుం దనుకుంటాను," అన్నాడు.

మరి కొంతసేపు సంభాషణ సాగాక రాజకుమార్తె, "మిత్రులుగానూ, శత్రులుగానూ కూడా ఉండేదెవరు?" అని రాజకుమారుణ్ణి అడిగింది.

రాజకుమారుడికి అడవిలో తనకు కలిగిన అనుభవం గుర్తుకొచ్చింది. తనను నిప్పు చెయ్యనివ్వని గాలే, అడవిలో కార్చిచ్చు పుట్టించి, వ్యాపింపజేసింది. అతను ఈ అనుభవం రాజకుమార్తెకు చెప్పి, "నిప్పూ, గాలీ తీసుకున్నట్టయితే అవి శత్రువులూ, మిత్రులూ కూడా అనవలిసి వస్తుంది గద!" అన్నాడు.

మరి కొంతసేపు మాటలు నడిచాక రాజకుమార్తె, "రెక్కలు లేకుండా ఎగిరేది ఏది?" అని అడిగింది.

దానికి రాజకుమారుడు నవ్వి, "మనసు రెక్కలు లేకుండా ఎగరగల దనటానికి సందేహం లేదు. నేను నిన్ను గురించి వినగానే నా మనస్సు ఎగిరి నీ దగ్గిర వచ్చి వాలింది. దాన్ని వెతుక్కుంటూ అష్ట కష్టాలూపడి నిన్ను చేరుకున్నాను. ఇలా వస్తున్న సంగతి ఎవరికీ చెప్పను కూడా లేదు," అన్నాడు.

తన ప్రశ్నలకు కాశీరాజకుమారుడు అనుభవ పూర్వకమైన సమాధానా లిచ్చినందుకు రాజకుమార్తె చాలా సంతోషించి, అతన్ని భర్తగా వరించింది. ఇద్దరికీ వైభవంగా పెళ్ళి జరిగింది.





# బుద్ధికి మందు

కాకతీయ సామ్రాజ్యంలోని ఒక నగరాన్ని శ్రీకంఠు డనే రాజు పాలించేవాడు. అతనిది విచిత్రమైన మనస్తత్వం. అతనికి ఆలోచనలు వచ్చేవేకావు; పొరబాటున ఏ ఆలోచన అయినా వస్తే ఒకంతట పోయేదికాదు.

శ్రీకంఠుడికి ఇద్దరు కొడుకు లుండేవాళ్ళు. వారికి విద్యనేర్పమని అతను ఒక గురువును ఏర్పాటు చేశాడు. కొద్ది కాలం గడిచాక రాజు గురువును పిలిపించి, "పిల్లల చదువు ఎలా సాగుతున్నది?" అని అడిగాడు.

"పెద్దవాడు బాగానే చదువుకుంటున్నాడు. కాని చిన్నవాడికి బొత్తిగా చదువు అంటటం లేదు," అన్నాడు గురువు.

"ఎందుచేత?" అని రాజు అడిగాడు.

"చిన్నవాడు అంత తెలివితేటలు కలవాడు కాడు," అన్నాడు గురువు.

"మరి మీ రెందుకు? తెలివితేటలు కలిగించటానికి కాదా?" అని రాజు అడిగాడు.

"కాదు, మహారాజా. ఉన్న తెలివితేటలను ఉపయోగించుకునేటట్టు చెయ్యటం గురువులకు సాధ్యమవుతుంది గాని, లేని తెలివితేటలను ఏ గురువు గాని ఎలా సృష్టి చేయగలడు? మీరు కావలిస్తే విచారించండి. ప్రజలలో తెలివిగలవాళ్ళు చాలా కొద్దిమంది మాత్రమే ఉంటారు. దానికి మన మేమీ చెయ్యలేం," అన్నాడు గురువు.

ఈ మాట విన్న శ్రీకంఠుడికి చాలా అసంతృప్తి కలిగింది. తెలివితేటలు గల వాళ్ళు తన ప్రజలలో కూడా చాలా కొద్దిమందే ఉంటున్నా రన్నమాట. అటువంటి వాళ్ళ బుద్ధిని చదువు కూడా సరిచెయ్యలేక పోవటం ఆశ్చర్యంగా వుంది. తన రాజ్యంలో అందరూ తెలివిగలవాళ్ళుగానే ఉండాలంటే ఏం చెయ్యాలి?

రాజు గురువును పంపేసి, తన ప్రధానితో సంప్రతించాడు.

సి. రాజగోపాలరావు

"మహారాజా, కొన్ని కొన్ని ఓషధుల ప్రభావం చేత బుద్ధిసూక్ష్మత పెరుగుతుందని వింటున్నాం. ఘనవైద్యులను పిలిపించి వారి సలహా తీసుకుందాం," అన్నాడు ప్రధాని. రాజుగారు పిలిపించగా ఘన వైద్యులు వచ్చారు.

"నా రాజ్యంలో అనేక మందమతులున్నట్టు విని నేను చాలా విచారిస్తున్నాను. మీరు అనేక ఔషధాల ప్రభావం తెలిసిన వాళ్ళు. మందమతులను చికిత్స చేసి మేధావులుగా తయారుచేయటానికి మందులేమైనా ఉన్నాయా?" అని రాజు వారిని ప్రశ్నించాడు.

"మహారాజా, ఏ కారణంచేత నైనా ఉన్న బుద్ధి చెడిపోతే దాన్ని చికిత్స చేయవచ్చు. కాని లేని బుద్ధిని సృష్టించటానికి మందున్నట్టు మేమెక్కడా వినలేదు, ఏ వైద్యశాస్త్రంలోనూ చదవలేదు," అని వైద్యులు ఏకగ్రీవంగా చెప్పారు.

రాజుకు ఈ మాట ఎంతమాత్రమూ రుచించలేదు. చెడిపోయిన బుద్ధిని సరి చెయ్యటానికి మందుంటే, లేని బుద్ధిని సృష్టించటానికి మందు ఎందుకుండదు? మందమతులను మేధావంతులుగా తయారు చేసే ఔషధాన్ని ఎరిగినవారెవరైనా ఉంటే



వారికి గొప్ప బహుమాన మిస్తానని రాజు చాటింపు వేయించాడు.

తరవాత కొద్ది రోజులకు రాజు దగ్గిరికి ఒకడు వచ్చి, "మహారాజా, మాది ధన్వంతరి వంశం. నా పేరు వజ్రనాభుడు. జడులను మేధావులుగా చేసే మందు నాకు తెలుసును. కావలిస్తే తమరు దాని ప్రభావాన్ని ప్రత్యక్షంగా చూడవచ్చు," అన్నాడు.

శ్రీకంఠుడికి ఈ వజ్రనాభుడిలో గురి కుదిరింది. "పరీక్షలు చేస్తూ కాలయాపన చెయ్యటానికి లేదు. ఈ మందు పనిచెయ్యటానికి ఎంత కాలం పడుతుంది?" అని అడిగాడు.

"ఒక ఏడాదిలో ఏటువంటి మూఢుడైనా మేధావి అయిపోతాడు, మహారాజా," అన్నాడు వజ్రనాభుడు.

"సరే, ఈ మందును భారీఎత్తున తయారు చెయ్యి. అవసరమైన ఖర్చులకు డబ్బు ఇస్తాను," అన్నాడు రాజు.

తరవాత రాజు మరొక చాటింపు వేసి, తన రాజ్యంలో ఉండే మందమతులందరూ వజ్రనాభుడి వద్ద బుద్ధిమందు కొని సేవించాలనీ, ఏడాది గడిచాక దేశంలో మూఢు డెవడన్నా ఉంటే వాడి తల తీసివేయబడుతుందనీ ప్రజలను హెచ్చరించాడు.

రాజశాసనానికి భయపడి అనేక వేల మంది బుద్ధిమందు కొనుక్కున్నారు. వజ్రనాభుడు రెండుచేతులా ధనం ఆర్జించాడు. ఏడాది గడిచింది. దేశంలో బుద్ధిహీనులున్నారేమో చూడమని రాజు మనుషులను పంపాడు. వారు తిరిగివచ్చి, దేశంలో ఇప్పుడు అందరూ మేధావులే నని చెప్పారు.

శ్రీకంఠుడు వజ్రనాభుడికి ఘనమైన సన్మానం చేసి, అతన్ని ఎన్నిక చేస్తూ కాకతీయ చక్రవర్తి వద్దకు పంపాడు. చక్రవర్తి; శ్రీకంఠుడి ప్రశంసాపత్రం అందరికీ చదివి వినిపించి, వజ్రనాభుడితో, "నువ్వు చాలా మంది మూఢులను చూసి ఉండాలి. నువ్వు చూసిన మూఢు లందరిలోకీ పరమమూఢు డెవరు ?" అని అడిగాడు.

"నా కీ ప్రశంసాపత్రం ఇచ్చిన శ్రీకంఠుడి కన్న గొప్ప మూఢుణ్ణి నే నెక్కడా చూడలేదు. నిజం చెప్పినందుకు నన్ను మన్నించండి," అన్నాడు వజ్రనాభుడు.

సభలో అందరూ గొల్లున నవ్వారు.

"నువ్వు నిజంగా తెలివిగలవాడివి. నువ్వు మా ఆస్థానంలోనే ఉండి నా మంత్రులలో ఒకడుగా పనిచెయ్యి," అన్నాడు చక్రవర్తి.

వజ్రనాభుడు చక్రవర్తి కొలువులో చేరి అందరు మంత్రుల కన్న చురుకైనవాడని పేరు సంపాదించుకున్నాడు.





# నాలుగో సూత్రం

ఒక ఊళ్ళో ఒక ధనికుడికి ఇద్దరు కొడుకులు. ధనికుడు తన జీవితమంతా కష్టించి కొడుకుల కోసం బోలెడంత డబ్బు కూడబెట్టాడు. ఆయన తన అవసాన కాలంలో కొడుకులకు ఒక పత్రం ఇస్తూ, "దీన్ని మీ తాత నా కిచ్చాడు. ఇందులో సుఖంగా బతకటానికి అవసరమైన సూత్రాలు నాలుగున్నాయి. వాటిలో మొదటి మూడింటినీ పాటించినట్టయితే నాలుగో దానితో పని ఉండదు. నేను అలాగే జీవించాను. మీరు కూడా మొదటి మూడు సూత్రాలనూ పాటించి, నాలుగోది అవసరం కాకుండా జీవించండి," అని చెప్పి కళ్ళుమూశాడు.

తండ్రికి ఉత్తరక్రియలన్నీ చేసినాక అన్నదమ్ము లిద్దరూ పత్రంలో ఉన్న సూత్రాలు ఇలా చదువుకున్నారు:

1. రుచిగా భోజనం చెయ్యాలి.
2. ఒళ్ళు మరిచి నిద్రపోవాలి.
3. తోడులేక తిరగరాదు.
4. కాలం కలిసి రాకపోతే గంగకూ, గోదావరికీ మధ్య కాలవ తవ్వాలి.

అన్న, ఈ సూత్రాలను గురించి శ్రద్ధగా ఆలోచించాడు, కాని తమ్ముడు, "ఇవి అందరికీ తెలిసినవే," అన్నాడు.

"అలా కాదు. ఇందులో ఏదో గూఢార్థం లేకపోతే మన తాత ఈ ప్రతాన్ని మన తండ్రి కివ్వడు, ఆయన దీన్ని భద్రంగా దాచిపెట్టి మన కివ్వడు," అన్నాడు అన్న.

"మొదటి మూడు సూత్రాలూ తెలుస్తూనే ఉన్నాయి. సుఖంగా తినాలి, హాయిగా పడుకోవాలి, స్నేహితులతో సరదాగా తిరగాలి. నాలుగోదే కొంచెం శ్రమతో కూడిన పని," అన్నాడు తమ్ముడు.

తొందర పడవద్దనీ, కొంచెం ఆలోచించమనీ అన్న ఎంత చెప్పినా వినక, తమ్ముడు తండ్రి సంపాదనలో తన వంతు పుచ్చేసు

ఎల్. భానుప్రసాద్

కుని, నిశ్చింతగా తింటూ, స్నేహితులతో కలిసి వినోదాలతో కాలం పుచ్చుతూ, తన వంతు డబ్బంతా కొద్ది కాలంలోనే హారతి కర్పూరం లాగా మాయం చేసి, కట్టు బట్ట లతో మిగిలాడు.

ఆ తరవాత అతను తన అన్న వద్దకు వెళ్ళి, "తాతయ్య పత్రంలో రాసి పెట్టినట్టే నడుచుకున్నాను. నా గతి ఏమయిందో చూడు. నువు తాతయ్య చెప్పిన సూత్రాలు పాటించక నిక్షేపంగా ఉన్నావు," అన్నాడు.

"నేను తాతయ్య చెప్పిన సూత్రాలను సరిగా అర్థం చేసుకున్నందు వల్లనే నీలాగా చెడిపోలేదు," అన్నాడు అన్న.

"నువు ఎలా అర్థం చేసుకున్నావు?" అని తమ్ము డడిగాడు.

"చూడు. రుచిగా భోజనం చెయ్యట మంటే ఏమిటి? బాగా అకలి మీద ఉన్న వాడికే రుచి బాగా తెలుస్తుంది. అకలి ఉండి భోజనం చెయ్యమన్నది మొదటి సూత్రం. అలాగే, బాగా శరీరశ్రమ చేసినవాడికి తప్ప ఒళ్లు తెలియని నిద్ర రాదు. అలసి పోయే దాకా పని చెయ్యమన్నది రెండో సూత్రం. తోడు లేకుండా తిరగవద్దంటే అడ్డమైన వాళ్ళనూ వెంట వేసుకు తిరగాలని కాదు. చేతికర్ర లేకుండా వెళ్ళవద్దని. వాటిని నేను అమలు చేశాను," అన్నాడు అన్న.

"అయితే నాకు గంగ నుంచి గోదావరికి కాలవ తవ్వటం తప్పదా?" అన్నాడు తమ్ముడు విచారంగా.

"దాన్ని కూడా నువు అపార్థం చేసు కున్నావు. గంగ అంటే మన బావి. గోదా వరి అంటే మన పశువుల కొట్టం. వీటి మధ్య తవ్వితే గాని తాతయ్య ఉద్దేశం తెలి యదు," అన్నాడు అన్న.

అన్న అనుకున్నట్టే, బావికీ పశువుల కొట్టానికీ మధ్య తవ్వగా వాళ్ళ తాత పాతి పెట్టిన డబ్బు దొరికింది. దాంతో తమ్ముడి దుర్దశ తొలగిపోయింది.





# గంధం చెట్టు

ఉదయపుర రాజుకు చంపకగంధి అని ఒక కుమార్తె ఉండేది. ఆమె అంటే తండ్రికి చాలా ముద్దు. ఆమె ఏది కోరితే అది చేసే వాడు. ఆమె గారాబంగా పెరిగి పెద్దదై పెళ్ళి యీడుకు వచ్చిన తరుణంలో ,ఒకనాడు తన చెలికత్తెలతో సహా ఊరి వెలపల నున్న తోపులలోకి వనభోజనానికి వెళ్ళింది. వన భోజనానికి రకరకాల భక్ష్యాలతోబాటు, పెరు గన్నం కూడా కట్టుకుపోయారు. భక్ష్యాలన్నీ అయిపోయాయి గాని పెరుగన్నం చాలా మిగిలి పోయింది. రాజకుమార్తె అక్కడే ఒక చిన్న గుంట తవ్వి, మిగిలిపోయిన పెరు గన్నాన్ని అందులో పూడ్చి, పైన మట్టి కప్పే సింది. తరవాత చంపకగంధీ, ఆమె చెలి కత్తెలూ రాజభవనానికి తిరిగి వెళ్ళిపోయారు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు రాజ కుమార్తె తండ్రి వెంట షికారుగా అదే ప్రాంతానికి వచ్చి, తాను పెరుగన్నం పాతి పెట్టిన చోట ఒక వింత మొక్క మొలిచి ఉండటం గమనించింది. దాని ఆకులూ, పూలూ, కాయలూ చాలా విచిత్రంగా ఉన్నాయి. ఆమెను రాజు, "ఏం మొక్కమ్మా అదీ? దాని కేసి ఎందుకంత పరీక్షగా చూస్తున్నావు?" అని అడిగాడు.

చంపకగంధి దాని వృత్తాంతమంతా తండ్రికి చెప్పింది. వాళ్ళు మాట్లాడుకునే టప్పుడు అక్కడ ఎవరూ లేరు. కాని దగ్గర లోనే ఒక చెట్టు మీద ఒక కోయయువకు డుండి రాజకుమార్తె తండ్రితో చెప్పినదంతా విన్నాడు. వాడు పక్షులను పట్టుకునేవాడు. పక్షి కోసమే చెట్టెక్కాడు, కాని రాజూ, రాజకుమార్తే అటు కేసి రాగానే, చెట్టు గుబుర్ల మధ్యకుపోయి కదలకుండా ఉండి పోయాడు.

తరవాత చంపకగంధి తన తండ్రితో సహా తిరిగి వచ్చేటప్పుడు, "నాన్నా, ఆ చెట్టు

పెండ్రం శీబలరాజు



పేరు చెప్పగలిగిన వాళ్లో పెళ్ళి చేసుకోవాలని నాకు అనిపిస్తున్నది. అలా ఏర్పాటు చెయ్యండి," అన్నది.

కూతురి ప్రతి కోరికనూ ఆజ్ఞగా భావించే రాజు, ఇల్లు చేరుతూనే మంత్రిని పిలిచి, "అమ్మాయికి స్వయంవరం అని దేశదేశాలా చాటింపు వేయించండి," అన్నాడు.

మంత్రి రాజపురోహితుణ్ణి పిలిచి, తగినంత వ్యవధిలో ముహూర్తం నిర్ణయించి, రాజు కోరిన విధంగా చాటింపు వేయించాడు. ఎందరో రాజులూ, సామంతులూ, వీరులూ స్వయంవరానికి వచ్చారు. రాజు వారి నందరినీ నగరం వెలపల ఉన్న తోపుల లోకి తీసుకుపోయి, వింత మొక్కను చూపించి, "ఇది ఏం మొక్కో సరిగా చెప్పిన వారికి నా కుమార్తెను చంపకగంధి నిచ్చి పెళ్ళి చేస్తాను," అన్నాడు.

ఒక్కడు కూడా దానికి ఏ పేరూ పెట్టలేక పోయారు. కొందరు తాము చూడని చెట్ల పేర్లు కూడా చెప్పారు, కాని రాజు ఒప్పుకో లేదు. అది ఏమి మొక్కో ఎవరూ చెప్ప లేరని స్పష్టమయింది. ఆ సమయంలో కోయయువకుడు ముందు కొచ్చి, "అది ఏం మొక్కో నేను చెబుతాను," అన్నాడు. వాడు ఆ నాడు కూడా తోపుకు వచ్చి, జనం చాలా మంది ఉండటం గమనించి, వింత చూడటానికి ఆగాడు.

"సరే చెప్పు. అది ఏం మొక్క?" అని రాజు అడిగాడు.

"పెద్దగన్నం మొక్క," అన్నాడు కోయవాడు.

వాడు చెప్పినది నిజమేనని రాజు ఒప్పుకున్నాడు. దేశదేశాల నుంచి వచ్చిన వారి కందరికీ తల తీసేసినట్టయింది. వాళ్ళు అప్పటి కప్పుడే రాజు వద్ద సెలవు పుచ్చుకుని తమ తమ దేశాలకు వెళ్ళిపోయారు.

ఈ పరిణామం రాజుకు అన్ని విధాలా అవమానకరమే అయింది. ఆయన తన

పరువు నిలుపుకోవాలంటే తన కుమార్తెను ఆ కోయవాడి కిచ్చి పెళ్ళి చెయ్యాలి. కాని ఆ పెళ్ళి తన చేతి మీదుగా ఎలా చేస్తాడు? పై దేశాల నుంచి వచ్చిన వాళ్ళు కూడా వెళ్ళిపోయారు. అందుచేత ఆయన తన కుమార్తెను కోయవాడికి ఇచ్చి, "దీన్ని మీ గూడానికి తీసుకుపోయి అక్కడే పెళ్ళి చేసుకో," అన్నాడు.

చంపకగంధి కిది మంచి శిక్షే అయింది. తండ్రి తనను గారాబంగా పెంచి, తన ప్రతిజ్ఞ తీర్చినందుకు తాను కోయవాడికి భార్య కావలిసిన గతి పట్టిందని గ్రహించి, ఆమె కోయవాడి వెంట బయలుదేరింది. వాడామెను అరణ్యమార్గాన చాలా దూరం తీసుకుపోయి, ఒక గంధం చెట్టు కింద కూర్చోమని, "మా గూడెం దగ్గరలోనే ఉంది. నువ్విక్కడే కూర్చో. నేను మా వాళ్ళ నందరినీ తప్పెట్లతో సహా యిక్కడికి తీసుకొస్తాను," అని తన గూడెం కేసి వెళ్ళిపోయాడు.



చంపకగంధి ఆ చందన వృక్షం కింద కూర్చుని, ఎవరూ లేరు గనక, ఎలుగెత్తి ఏడవసాగింది. అప్పుడు ఆ చందనవృక్షంలో నుంచి ఒక యక్షిణి బయటికి వచ్చి, "ఎవరమ్మా, నువ్వు? అరణ్యంలో ఎందు కిలా ఒంటరిగా కూర్చుని ఏడుస్తున్నావు?" అని అడిగింది.

చంపకగంధి యక్షిణితో జరిగినదంతా చెప్పింది. "అయితే నీకా కోయవాణ్ణి పెళ్ళాడటం ఇష్టంలేదా?" అని యక్షిణి అడిగింది.

"ఎంత మాత్రమూ ఇష్టం లేదు," అన్నది చంపకగంధి.

"అయితే ఈ చెట్టులోకి వచ్చెయ్యి. ఇందులో నేను చాలా కాలంగా ఉంటున్నాను. ఉండటానికి సుఖమైన ఏర్పాట్లన్నీ చేసి ఉంచాను. కావలిస్తే నేను మరో చెట్టు చూసుకోగలను," అని యక్షిణి చంపకగంధిని చెట్టు లోపలికి తీసుకుపోయి,



అందులో తాను చేసిన ఏర్పాట్లన్నీ ఆమెకు చూపి, తాను మరో చెట్టు వెతుక్కుంటూ వెళ్ళిపోయింది.

ఈ లోపుగా కోయవాడు గూడెంలో తన వాళ్ళతో, తాను రాజకుమార్తెకు భర్తను కాబోతున్నానని చెప్పాడు. మొదట ఎవరూ నమ్మలేదు. జరిగినదంతా వాడు చెప్పిన మీదట వాళ్ళు నమ్మక తప్పలేదు. వెంటనే తప్పెట్లూ, బూరాలూ, శంఖాలూ పైకి తీసి, గూడెం వాళ్ళంతా అట్టహాసంగా కోయవాడి వెంట చందనంచెట్టు దగ్గిరికి వచ్చారు.

కాని అక్కడ రాజకుమార్తె లేదు. చుట్టు పక్కల అడవి అంతా గాలించారు. రాజకుమార్తె జాడ ఏ మాత్రమూ తెలియ రాలేదు. గూడెం వాళ్ళు కోయవాణ్ణి తిట్టి, తిరిగి వెళ్ళిపోయారు.

చంపకగంధి ఆ చందనవృక్షం లోనే ఉంటూ, ఎవరూ లేని సమయంలో బయటికి వచ్చి, వనఫలాలు కోసుకుని తింటూ, యక్షిణి వచ్చినప్పు డామెతో కబుర్లాడుతూ కాలక్షేపం చేస్తున్నది.

ఈ అరణ్యానికి అవతల మరొక రాజ్యం ఉంది. ఆ రాజు కొక కొడుకున్నాడు. అతనికి పెళ్లియీడు వచ్చింది. అతని కోసం కన్యలను చూస్తున్నారు.

ఆ రాజకుమారుడికి తోట లంటే చాలా ఇష్టం. అతను తమ రాజధానిలో నూరు ఎకరాల మేర ఒక పెద్ద తోట వేయించి అందులో అన్నిరకాల వృక్షాలనూ నాటించాడు. ఒక్క చందనవృక్షం మాత్రమే నాట వలిసి ఉన్నది. అందుకు గాను అతను తన భటులను అరణ్యానికి పంపాడు. వాళ్లు అరణ్య మంతా వెతికి, చివరకు చంపక గంధి ఉండే వృక్షాన్ని కనిపెట్టారు. వెంటనే వాళ్ళు ఆ వృక్షాన్ని వేళ్ళతో సహా తవ్వి, బండి మీద పెట్టుకు తీసుకుపోయి, రాజకుమారుడు తోటలో సిద్ధం చేయించి ఉంచిన చోట పాతేశారు.

మర్నాడు చంపకగంధి తన మామూలు చొప్పున చెట్టు నుంచి బయటికి వచ్చి, చుట్టూ కలయ జూసింది. ఆమెకు అరణ్యం కనిపించటానికి బదులు అందమైన తోట కనిపించింది. కొంత దూరంలో ఒక చక్కని కొలనూ, అందులో తామరపూలూ ఉన్నాయి. ఆ సమీపంలోనే పళ్ళచెట్లున్నాయి.

ఆమె ఆ కొలనులో స్నానం చేసి, కొన్ని పళ్ళు కోసుకు తిన్నది. అదే సమయంలో అక్కడికి రాజకుమారుడు వచ్చాడు. ఇద్దరూ ఒకరినొకరు చూసుకుని నిర్ఘాంతపోయారు. చంపకగంధి అంత అందమైన యువకుణ్ణి ఎన్నడూ చూడలేదు. అంత అందమైన స్త్రీ తన తోటలోకి ఎలా వచ్చిందో అతనికీ అర్థం కాలేదు.

"ఎవరు నువు? మా తోటలోకి ఎలా వచ్చావు?" అని రాజకుమారుడు ఆమెను అడిగాడు. ఆమె అతనికి తన వివరాలు చెప్పటానికి సిగ్గు పడింది. తాను అజ్ఞానంగా తన పెళ్ళికి పెట్టిన నియమమూ, దాని ఫలితంగా తాను ఒక కోయవాణ్ణి పెళ్ళాడవలిసి రావటమూ, యక్షిణి దయవల్ల ఆ అవమానం వెంట్రుకవాసిలో తప్పిపోవటమూ తలుచుకుంటే ఆమెకే ఎంతో సిగ్గుగానూ, బాధగానూ ఉన్నది.



అందుచేత ఆమె అతనితో, "నా పేరు చంపకగంధి. నేనొక చందనవృక్షంలో నివసిస్తూ ఉంటాను. నిన్నటి దాకా అది అరణ్యంలో ఉండేది. ఇవాళ చూస్తే ఇక్కడ ఉన్నది," అన్నది.

రాజకుమారుడామెను చూడగానే ప్రేమించాడు. ఆమె తప్పక ఏ రాజకుమార్తో అయి ఉంటుందనీ, ఆమెను తన ఇంటికి తీసుకుపోయి, తల్లిదండ్రుల అనుమతితో పెళ్ళాడదామనీ ఆశపడ్డాడు. కాని ఆమె తానొక రాజకుమార్తెనని చెప్పలేదు. ఎవరో, చెట్టులో కాపరం ఉంటున్న దాన్ని పెళ్ళాడతానంటే పెద్ద వాళ్ళు ఒప్పుకోరు. కాని



చంపకగంధిని పెళ్ళాడాలన్న కోరిక అతనిలో చాలా బలంగా ఉన్నది. అందుచేత ఆమెను రహస్యంగా పెళ్ళాడాలని అతను నిశ్చయించుకున్నాడు.

అత నామెను, "నీకు వివాహ మయిందా?" అని అడిగాడు.

ఆమె కాలేదన్నది.

"నన్ను పెళ్ళాడతావా?" అని అతను మళ్ళీ అడిగాడు.

చంపకగంధి సంతోషంగానే ఒప్పుకున్నది.

"అయితే, నిన్ను మా యింటికి తీసుకుపోలేను. ప్రస్తుతానికి నువ్వు నీ చెట్టులోనే కాపరం ఉండాలి," అన్నాడతను.

దానికి చంపకగంధి ఎలాంటి అభ్యంతరం చెప్పలేదు.

రాజకుమారుడు ఇంటికి వెళ్ళి తన తల్లిదండ్రులతో, "నాకు పెళ్ళి చేయాలనుకుంటున్నారు గద. మన తోటలో ఉన్న చందనపు చెట్టుకు నన్ను పెళ్ళిచెయ్యండి. నే నింకెవరినీ చేసుకోను," అన్నాడు.

తమ కొడుక్కు మతిచలించి ఉంటుందనుకున్నారు రాజూ, రాణీ. చక్కని రాజకుమార్తెలున్నారు, వారిలో ఎవతెనో చూసి పెళ్ళాడమని ఎంతో బతిమాలారు, కాని అతను చందనవృక్షాన్ని తప్ప మరెవరినీ పెళ్ళాడనని మూర్ఛించి కూర్చున్నాడు.

రాజు మంత్రితో సంప్రతించాడు.

"అతని కోరిక పైకి వెర్రిగానే కనిపిస్తున్నప్పటికీ, అటువంటి కోరికకు బలమైన కారణం ఉండే ఉంటుంది. కాలక్రమాన అదే బయటపడుతుంది. అతను కోరిన ప్రకారమే చేద్దాం," అన్నాడు మంత్రి.

రాజు పురోహితుణ్ణి పిలిపించి, పెళ్ళికి ముహూర్తం పెట్టించి, పై వాళ్ళ కెవరికీ తెలియకుండా, తోటలో చందనవృక్షానికి రాజకుమారుడికీ శాస్త్రోక్తంగా పెళ్ళి చేయించాడు. తరవాత రాజకుమారుడు, చందన వృక్షపు కాండం మధ్యగా ఉండేటట్టుగా,

దాని చుట్టూ అందమైన కుటీరం కట్టించి, తోటలోకి ఎవరూ రారాదని ఆంక్ష పెట్టి, ఆ కుటీరంలోనే చంపకగంధితో కాపరం ఉండసాగాడు.

సంవత్సరం తిరిగే సరికి చంపకగంధి గర్భవతి అయి, ఒక మగపిల్లవాణ్ణి ప్రస వించింది. రాజకుమారుడు తన తండ్రి వద్దకు వెళ్ళి, "నాకు కొడుకు పుట్టాడు. వాడికి నామకరణ మహోత్సవం ఏర్పాటు చేయండి. నా పెళ్ళి లాగా రహస్యంగా జరప నవసరం లేదు. చుట్టుపక్కల రాజు లందరినీ పిలిచి, బాగా వైభవంగానే జరి పించండి," అన్నాడు.

రాజు ఆశ్చర్యపోయి తన మనవడి నామ కరణోత్సవానికి చుట్టుపక్కల దేశాల రాజులందరినీ పిలిపించాడు. ఆ రోజే రాజ కుమారుడు తన భార్యనూ, కుమారుణ్ణి తీసుకుని రాజభవనానికి వచ్చాడు. చంపక గంధిని చూసి అందరూ ఆశ్చర్యపోయారు.

"ఎవరీమె? ఈమె నీ భార్య ఎలా అయింది?" అని అతన్ని రాజూ, రాణీ అడిగారు.

"నేను వెళ్ళాడిన చందనవృక్షం లోనే ఈమె ఉంటుంది. అంతకు పైన నాకూ తెలీదు," అన్నాడు రాజకుమారుడు.

కాని నిజం త్వరలోనే బయటపడింది. నామకరణ మహోత్సవానికి వచ్చిన రాజు లలో చంపకగంధి తండ్రి కూడా ఉన్నాడు. ఆయన తన కూతుర్ని గుర్తించి, "నువు ఇక్కడ ఉన్నావా, అమ్మా? అడవుల పాలయావనుకున్నాను," అన్నాడు.

చంపకగంధి అందరూ వింటూండగా తన పూర్తి కథను భర్తకూ, తండ్రికీ చెప్పింది. తమ కోడలు రాజకుమార్తె అయినందుకు ఆమె అత్తమామలు ఎంతో సంతోషించారు.

ఆటుతరవాత చంపకగంధి చెట్టులో కాపరం మానేసి రాజభవనంలోనే ఉంటూ సుఖంగా కాలం వెళ్ళబుచ్చింది.





# చెరపకురా చెడేవు

విశ్వగిరి అనే నగరంలో రామదాసు అనే గొప్ప సముద్రవ్యాపారి ఉండేవాడు. ఆయ నకు రవిదేవుడూ, చంద్రదేవుడూ అని ఇద్దరు కొడుకులుండేవారు. వా రిద్దరూ ఇంకా తండ్రి వ్యాపారంలో ప్రవేశించ లేదు. వారికి వ్యాపారానుభవం కలిగే అవకాశం ఇవ్వ టానికై రామదాసు ఒకసారి తన కొడుకు లిద్దరినీ పిలిచి, "మీ కిద్దరికీ సమంగా డబ్బిస్తాను. ఆ డబ్బుతో మీ రిద్దరూ మీ మీ తెలివితేటల కొద్దీ వ్యాపారం చేసి, లాభం గడించుకు రండి," అన్నాడు.

రవిదేవుడూ, చంద్రదేవుడూ తండ్రి ఇచ్చిన డబ్బు తీసుకుని, ఆమడదూరంలో ఉన్న రేవుపట్టణానికి వెళ్ళారు. అక్కడ రవిదేవుడు తన వద్ద ఉన్న డబ్బుతో తనకు తోచిన సరకులు కొని తమ బసలో భద్ర పరుచుకున్నాడు. చంద్రదేవుడు మాత్రం ఏమికొన వలిసినదీ నిర్ణయించ లేక, రేవులో కాలు కాలిన పిల్లి లాగా అటూయిటూ తిరుగుతూ తాత్సారం చేశాడు.

సముద్రం మీద బయలుదేరే ఓడలు ఇంకా నాలుగు రోజుల దాకా రావని తెలి సింది. అందుచేత చంద్రదేవుడు సామాను కొనటానికి ఇంకా వ్యవధి ఉన్నది.

అప్పుడు రవిదేవుడు తన తమ్ముడితో, "తమ్ముడూ, నే నొక్కసారి ఇంటికి వెళ్ళి మళ్ళీ వస్తాను. ఇంటి వద్ద కొన్ని ముఖ్య మైన సామిగ్రి వదిలి పెట్టి వచ్చాను. నేను వచ్చే దాకా కాస్త నా సరుకులను చూస్తూ వుండు," అని వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి చంద్రదేవుడు నిద్ర పోనే లేదు. అతను తమ బస ముందున్న పంచలో కూర్చుని, విచారంగా సముద్రం కేసి చూస్తుండగా, గడ్డాలూ, మీసాలూ పెంచు కుని, మునీశ్వరుడు లాగా ఉన్న ఒక మనిషి అటుగా పోతూ, చంద్రదేవుణ్ణి చూసి ఆగి,

వై. జనార్దన్

"ఏమి, నాయనా, ఎందుకు విచారముగా ఉన్నావు? మీ తండ్రి గారిచ్చిన ధనము ఎలా వినియోగించవలెనో తెలియ లేదా?" అని గడ్డం నిమురుకుంటూ అడిగాడు.

ఆ మునికి గల దివ్యదృష్టికి చంద్రదేవుడు అద్భుత పడి, "అవును, స్వామీ!" అన్నాడు.

"నీ తండ్రి యిచ్చిన ధనముతో నవ ధాన్యములు కొని, వాటిని సముద్రమున చల్లించుము. తరువాత ఏమగునో నీకే తెలియగలదు," అని సలహా ఇచ్చి ముని వెళ్లిపోయాడు.

చంద్రదేవుడు మర్నాడు తెల్లవారగానే తన వద్ద ఉన్న డబ్బంతా పెట్టి, నగరంలోని వ్యాపారుల వద్ద నవధాన్యాలు కొని సముద్రంలో చల్లించాడు.

ఇంతలో, ఇంటి నుంచి రవిదేవుడు తిరిగి వచ్చి, తమ్ముడు చేసిన పని తెలుసుకుని, "ఛీ, మూర్ఖుడా! నాన్నగారు వ్యాపారాని కని ఇచ్చిన డబ్బును సముద్రం పాలు చేశావా? ఈ సంగతి తెలిస్తే నాన్నగారు నిన్ను కొరత వేయించి తీరుతారు," అని చివాట్లు పెట్టాడు.

చంద్రదేవుడు చాలా భయపడ్డాడు.

తరవాత ఓడ బయలు దేరుతూ ఉంటే, రవిదేవుడు తన సరుకులతో సహా అందులోకి ఎక్కి దేశాంతరాలకు వెళ్లిపోయాడు.



చంద్రదేవుడికి ఇంటికి వెళ్లి పోవటానికి ధైర్యం చాలలేదు. అతను ఆ రాత్రి సముద్ర తీరానే, కాలు గాలిన పిల్లి లాగా పచార్లు చేయసాగాడు.

ఆ సమయంలో ఒక వింత జరిగింది. సముద్రపు అలల మీద ఏవేవో తేలి రాసాగాయి. అలలు వాటిని ఒడ్డున వేసి వెనక్కు వెళ్ళిపోతున్నాయి. చంద్రదేవుడు వాటిని తీసి చూస్తే అవి ముత్యపుచిప్పలు. ఆ ముత్యపుచిప్పలు వేల సంఖ్యలో ఒడ్డుకు కొట్టుకుని వస్తున్నాయి. చంద్రదేవుడికి తెల్లవార్లూ వాటిని ఇసలోకి తెచ్చి పడవెయ్యటంతోనే సరిపోయింది.

మర్నాడు అతను వాటిలో నుంచి ముత్యాలు తీయించి, వాటిని అక్కడే అమ్మగా, తండ్రి ఇచ్చిన సొమ్ముకు అయిదారింతలు డబ్బు వచ్చింది. చంద్రదేవుడా డబ్బును సముద్రుడి కానుకగా భావించి, ఇంటికి తిరిగి వెళ్లిపోయాడు.

సముద్రాల మీద వెళ్లిన రవిదేవుడి ఓడ సముద్రంలోనే మునిగిపోయింది. అతను తన సరుకంతా పోగొట్టుకుని, ప్రాణాలతో బయట పడి, అనేక వ్యాధులతో తీసుకుని, కొన్ని మాసాల అనంతరం జీవచ్ఛవంలాగా ఇంటికి తిరిగి వచ్చాడు. అతన్ని చూసి అందరూ జాలిపడ్డారు.

ఇంటికి వస్తూనే రవిదేవుడు తమ్ముణ్ణి కావిలించుకుని, "నీకు ద్రోహం చేసినందుకు నాకు మంచి శిక్ష జరిగింది. నన్ను క్షమించు తమ్ముడూ!" అని వలవలా ఏడ్వసాడు.

చంద్రదేవుడు ఆశ్చర్యపోతూ, "నాకు నువ్వేమి ద్రోహం చేశావు?" అని అడిగాడు.

"నేను ఇంటికి పోతానని నీతో అబద్ధం ఆడి, సన్యాసివేషం వేసుకుని నీ దగ్గిరికి వచ్చి, నీ డబ్బంతా నవధాన్యాల రూపంలో సముద్రంలో పోయించాను!" అన్నాడు రవిదేవుడు.





# కొత్త పిశాచం

కదళీపురాన్ని ఏలే మిత్రవర్ధనుడు చాలా సమర్థుడైన రాజు. అతని పాలనలో రాజ్యం చాలా సుభిక్షంగా ఉండేది. అతనికి రాత్రి వేళ మారువేషంలో తిరుగుతూ ప్రజల కష్ట సుఖాలు తెలుసుకునే అలవాటుండేది.

అతను ఆ విధంగానే తిరుగుతూ ఒక రాత్రి ఒక పేద కుటీరం సమీపంగా వెళుతూండగా, లోపలి నుంచి సంభాషణ విన పడింది. అతను ఆగి వినసాగాడు.

భార్య భర్తతో అంటున్నది: "ఈ కటిక దారిద్ర్యం ఇలా ఎంతకాలమని భరిస్తాం? రాజుగారు చాలా దయాపరుడని చెబుతారు. ఆయన దర్శనం చేసుకుని, ఇంత శ్మశానం ఇచ్చినా సరే పుచ్చుకో."

ఈ మాటలు విని రాజు ముందుకు సాగిపోయాడు.

మర్నాడు ఆ పేదవాడు రాజును దర్శనం చేసుకుని, "మహారాజా, బతకలేకుండా ఉన్నాను. ఇంత శ్మశానమైనా ఇప్పించండి," అన్నాడు.

రాజు ఆ పేదవాడికి ఒక శ్మశానం ఇప్పించాడు. వాడు ఇంటికి తిరిగి వచ్చి, "రాజును శ్మశానం అడిగాను ఇచ్చాడు. ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు భార్యతో.

"ఏం చేస్తాం? అక్కడ చెట్లేవన్నా ఉంటే కొట్టుకురా. కట్టెలు అమ్ముకు తిందాం. ఆ తరవాత అక్కడే సాగు చేసుకుని, పండించుకుని తినవచ్చు," అన్నది భార్య.

పేదవాడు గొడ్డలి భుజాన పెట్టుకుని శ్మశానానికి వెళ్ళాడు. అక్కడ ఒకే ఒక పెద్ద చింతచెట్టున్నది. వాడు దాన్ని కొట్ట బోయే సరికి, దాని మీద ఉన్న వందలాది పిశాచాలు దిగి వచ్చి, వాడి చుట్టూ మూగి, "బాబ్బాబు, ఈ చెట్టును కొట్టకు. దీని మీద మేమంతా కాపరం ఉంటున్నాం.

బి. ఎం. నాగేంద్రరావు

పుణ్యం వుంటుంది. మాకున్న ఈ ఆధారం కాస్తా తీసెయ్యకు," అన్నాయి.

పిశాచాలను చూసి మొదట పేదవాడు తారుకున్నాడు గాని, అవి ప్రాధేయపడటం చూసి, ఖంకం తెచ్చుకుని, "కొట్టెయ్యక పోతే నా కెలా జరుగుబాటవుతుంది? దీన్ని కొట్టాలి. తరవాత భూమి దున్ని, విత్తులు నాటి, పంటవేసి, ఆ తిండి గింజలతో నేను బతకాలి. నన్ను రొకాయించకండి," అంటూ గొడ్డలి మళ్ళీ ఎత్తాడు.

"తొందరపడకు! కాస్త మా మాట కూడా విను. నీకు కావలిసింది ధాన్యమే గదా! నీ కేమీ శ్రమ లేకుండా, నీకు కావలిసిన ధాన్య మంతా మేమే పోగు చేసి, ముడుపుగా నీకు అందజేస్తాం, సరా?" అన్నాయి పిశాచాలు.

"సరే, పోనీ మీరు చెప్పినట్టే కానివ్వండి. రెండు మాసాలలో ధాన్యం మా ఇల్లు చేరాలి. లేకపోతే నే నింక ఆగను. ఆc!" అని పేదవాడు గొడ్డలి భుజాన పెట్టుకుని, ఇంటికి తిరిగి వచ్చేసి, జరిగినదంతా భార్యకు చెప్పాడు.

భార్య కూడా ఈ ఏర్పాటుతో చాలా తృప్తిపడింది.

అది మొదలు పిశాచాలు రోజూ ధాన్యాన్ని సేకరిస్తూ వచ్చాయి.



ఇంతలో ఒక కొత్త పిశాచం ఆ చింత చెట్టు మీదికి వచ్చింది. మిగతా పిశాచాలు కూడ బెడుతున్న ధాన్యాన్ని చూసి, "ఏమిటి దంతా? మనకి ధాన్యంతో ఏం పని?" అని అడిగింది. మిగిలిన పిశాచాలు చెట్టు గొడవంతా కొత్త పిశాచానికి చెప్పాయి.

కొత్త పిశాచం కళ్ళెర్ర జేసి, "మనం ఏమిటి, మనుషులకు భయపడట మేమిటి? నేను వెళ్ళి వాడి అంతు తేలుస్తాను," అంటూ పేదవాడి ఇంటికి బయలుదేరింది.

పేదవాడి గుడిసె మీద ఒక చిక్కుడు పాదు పాకుతున్నది. దాన్ని ప్రతి రాత్రీ ఒక గేదె వచ్చి తిని పోతున్నది. దానికి కాస్త బుద్ధి చెప్పాలని ఆ రాత్రి పేదవాడు దుడ్డు కర్ర బకటి చేతబట్టి ఒక చోట నక్కి ఉన్నాడు. అంతలోనే కొత్త పిశాచం లోపలికి వచ్చింది. పేదవాడు అలికిడి విని, గేదె అనుకుని, "చావు!" అంటూ దుడ్డుకర్రతో ఒక్క పెట్టుపెట్టాడు.

"చచ్చాన్రో!" అని కొత్త పిశాచం కేక పెట్టింది. ఆ వచ్చినది పిశాచమని గ్రహించి పేదవాడు, "ఏం, ఎందుకొచ్చావు?" అని అడిగాడు కోపంగా.

"ఏం లేదండీ! మీకు వడ్లుగా కావాలో, బియ్యంగా కావాలో కనుక్కొని రమ్మని మా వాళ్ళు పంపారండి," అన్నది కొత్త పిశాచం వణుకుతూ.

"అదా సంగతి? బియ్యంగానే పంపమను," అన్నాడు పేదవాడు.

కొత్త పిశాచం చెట్టుకు తిరిగి వెళ్ళి, "అయనగారికి వడ్లు పనికిరావుట. బియ్యం కావాలిట!" అన్నది.

"ఇదా నువు చేసుకొచ్చిన నిర్వాకం! అసలు వడ్లు దొరక్క నా నా యాతనగానూ ఉంటే, దాన్ని దంచి బియ్యం చేసే పని కూడా మా ప్రాణం మీదికి తెచ్చి పెట్టావా?" అంటూ పాత పిశాచాలు కొత్త పిశాచాన్ని నానా తిట్లూతిట్టాయి.





# ఆస్థాన సోమరులు

ఒక గ్రామంలో ఒక రైతుకు ఇద్దరు కొడుకులుండేవాళ్ళు. వాళ్ళు పరమసోమరులు. ఒకడి పేరు సోమన్న, రెండోవాడి పేరు సూరన్న. తండ్రి వాళ్ళ చేత ఏ పనీ చేయించలేక పోయాడు; "మీకు తిండి పెట్టడం కూడా దండగ. నా యింట్లో నుంచి తక్షణం వెళ్ళిపొండి," అని తరిమేశాడు.

వాళ్ళు ఊరు వదిలి బయలుదేరారు. దారిలో సోమన్నకు ఒక రూక కనబడింది. కాని అతడికి వంగి తీసుకునే ఓపికలేక, సూరన్నతో, "ఆ రూక తీసుకురా, తమ్ముడూ," అంటూ ముందుకు నడిచాడు.

సూరన్న దాన్ని తీసుకోలేదు. తన అన్న దాన్ని చూశాడు గనక, వాడే తీసుకుని ఉండవలిసిందని వాడు అనుకున్నాడు.

ఇద్దరూ గ్రామంలోకి వెళ్ళారు. ఇద్దరికీ ఆకలి దహించుకు పోతున్నది. ఒక దుకాణంలో అరటిపళ్ళు అమ్ముతున్నాయి.

"ఆ అరటిపళ్ళు ఎట్లా ఇచ్చావు?" అని సోమన్న దుకాణం వాణ్ణి అడిగాడు.

"డజను పళ్ళ ఖరీదు అర్ధరూక," అన్నాడు దుకాణంవాడు.

"ఒలిచి నోట్లో పెడితే ఎంత తీసుకుంటావు?" అని సోమన్న మళ్ళీ అడిగాడు.

"ఒకరూక," అన్నాడు దుకాణంవాడు.

"మా ఇద్దరికీ చెరో ఆరు అరటిపళ్ళూ వొలిచి, నోట్లో పెట్టు," అన్నాడు సోమన్న.

దుకాణంవాడు పెట్టిన అరటిపళ్ళు తిన్నాక ఇద్దరి ఆకలీ తీరింది.

"తమ్ముడూ, రూక ఆ మనిషి కిచ్చెయ్యి," అన్నాడు సోమన్న.

"ఏ రూక?" అని సూరన్న అడిగాడు.

"నిన్ను తీసుకోమంటినే, ఆ రూక," అన్నాడు సోమన్న.

సూరన్న మాట్లాడక నేల కేసి చూస్తూ ఉండిపోయాడు.

కె. కె. రావు

వాళ్ళ దగ్గిర డబ్బులు లేవని దుకాణం వాడికి తెలిసిపోయింది. వా డా ఇద్దరినీ ఒక గుంజకు కట్టేశాడు. వాడు అక్కడ మూగిన జనంతో వాళ్ళను గురించి చెబుతూండగా రాజభటులు అక్కడికి వచ్చి, సోమన్న నూరన్నల వృత్తాంతం విని, దుకాణంవాడి కివ్వవలసిన డూక తామే ఇచ్చి, వా రిద్దరినీ రాజుగారి దగ్గిరికి తీసుకుపోయారు.

ఆ రాజుగారు సోమరులను వెతికి పట్టుకు రమ్మని తన భటులను గ్రామాల మీదికి పంపి ఉన్నాడు. ఆయనకు ఒకనాడు ఒక బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది. తన ఆస్థానంలో సోమరులు లేరు. ఆస్థాన సోమరులను ఏర్పాటు చేసుకోవాలన్న కోరిక కొద్దీ ఆయన తన దేశంలో కనిపించిన సోమరుల నందరినీ భటుల చేత ఇలాగే నగరానికి తెప్పించాడు.

గ్రామగ్రామాల నుంచీ వచ్చిన సోమ రుల నందరినీ రాజసభలో హాజరు పరి చారు. వాళ్ళంతా చాలామంది ఉన్నారు.

"మీలో సోమరులైన వాళ్ళంతా చేతు లెత్తండి," అని రాజు అన్నాడు.

కొందరు చేతులు పైకెత్తారు, కొందరు కొంచెంగా ఎత్తారు. సోమన్న, నూరన్నలు అసలు చేతులెత్తనే లేదు.



"మీ రిద్దరూ సోమరులు కారా, చేతు లెత్తలేదేం ?" అని రాజు అడిగాడు.

"ఎందుకండీ, అదో శ్రమ ? తెలుస్తూనే ఉందిగా !" అన్నాడు సోమన్న.

రాజు సంతోషించి, వాళ్లిద్దరే నిజమైన సోమరులని నిర్ణయించాడు.

"వీళ్ళను అప్పుడే ఆస్థానసోమరులని నిర్ణయించేశారా ?" అన్నాడు మంత్రి.

"లేదు, లేదు. వీళ్ళకు ఇంకా రెండు పరీక్ష లున్నాయి," అన్నాడు రాజు.

రాజభటులు వారిని ఒక గదిలోకి తీసుకు పోయారు. అక్కడ పంచభక్ష్య పరమా న్నాలు పాత్రలలో పెట్టిఉన్నాయి. ఆకలి

మీద ఉన్న అన్నదమ్ములకు వాటిని చూడగానే ప్రాణం లేచి వచ్చినట్టయింది. కాని తినటానికి విస్తళ్ళు లేవు.

"నువ్వు పోయి, రెండు విస్తళ్ళు పట్టుకు రారా, తమ్ముడూ," అన్నాడు సోమన్న.

"ఎందు కొచ్చిన శ్రమ! మనని ఇక్కడికి తెచ్చినవాళ్ళు విస్తళ్ళు తీసుకురారా?" అన్నాడు తమ్ముడు.

అరగంట గడిచింది. వాళ్ళు మొద్దుల్లాగా కదలనే లేదు. ఇంతలో ఆ గదిలోకి ఒక కుక్క వచ్చింది. అది పంటకాలన్నీ తినేస్తుంటే దాన్ని తోలటానికి కూడా ఇద్దరూ ప్రయత్నించలేదు.

ఇదంతా రహస్యంగా కనిపెడుతున్న రాజు పరమానందంతో, "రెండో పరీక్షలో కూడా నెగ్గారు. మూడో పరీక్ష కూడా పెడదాం," అన్నాడు మంత్రితో.

రాజభటులు వచ్చి ఆ అన్నదమ్ములను, "మీ భోజనా లయాయా?" అని అడిగారు. లేదన్నారు సోమరులు. భటులు వాళ్ళను ఒక పూరిపాకలోకి తీసుకుపోయి, అందులో వాళ్ళకు భోజనాలు ఏర్పాటుచేశారు.

అంతలోనే పాకకు నిప్పు అంటుకున్నది. ఇద్దరూ భోజనం ముగించి, భుక్తాయాసంతో నడుములు వాల్చారు. అప్పుడు వాళ్ళకు పాక తగలబడుతూండటం కనబడింది.

"పాక తగలడుతున్నట్టున్నదే!" అన్నాడు ఒకడు.

"మంట లింకా దూరంగానే ఉన్నాయిలే. మన దాకా రానీ!" అన్నాడు రెండోవాడు.

"ఈ లోపల రాజుగారి మనుషులు ఆర్పనే ఆర్పేస్తారులే," అన్నాడు మొదటివాడు. ఇద్దరూ కదలనే లేదు.

రాజుగారికి పరమానంద మయింది. భటులను పంపి, వాళ్ళిద్దరినీ బయటికి మోయించి తెచ్చి, వాళ్ళను తన ఆస్థాన సోమరులుగా నియమించుకున్నాడు.





# కృష్ణావతారం

యాదవులు జరాసంధుడు మొదలుగాగల రాజుల సేనలను ఓడించి, విజయోత్సాహంతో సింహనాదాలు చేస్తూ, విజయ దుందుభులు మోగిస్తూ, బలరాముణ్ణీ, సాత్యకినీ ముందుంచుకుని ద్వారకకు తిరిగిపోయారు.

కృష్ణుడు రుక్మిణిని తీసుకుని వెళ్ళిపోగానే శ్రుతపర్వుడు రుక్మిని తన రథం మీద కూర్చో బెట్టుకుని బయలుదేరాడు. అయితే రుక్మి, తన చెల్లెలైన రుక్మిణిని తీసుకు రాకుండా కుండినపురం ప్రవేశించనని ప్రతిజ్ఞ చేసి ఉన్నాడు; ఆ ప్రతిజ్ఞ విఫలం అయింది గనక, అతను భోజకటక మనే నగరం నిర్మించి, అందులోనే ఉండిపోయాడు.

జరాసంధుడు మూర్ఛ తెలియగానే, చెల్లాచెదరైన తన సేనలను తిరిగి ఏకం చేసుకుని, పూర్తిగా నవ్వుల పాలైపోయిన శిశుపాలుణ్ణి వెంట బెట్టుకుని తన దేశానికి వెళ్ళిపోయాడు.

యాదవవృద్ధులు కృష్ణుడి వివాహానికి ముహూర్తం నిశ్చయించి, బంధుకోటికీ, ఇతర రాజులకూ ఆహ్వానాలు పంపారు. రాచనగరుకు పెళ్ళిముస్తాబు జరిగింది. మణులు కూర్చిన గోడలను కుంకంపువ్వుతో తుడిచి ధగధగా మెరిసేటట్టు చేశారు. బంగారు స్తంభాలకు కట్టిన గుడ్డలు ఊడదీసి, వాటి పైనున్న చెక్కడపు పనితనం అందరికీ కనపడేలాగు చేశారు. గచ్చునేలల మీద కస్తూరి నీరు పోసి రుద్ది మెరుగు

## 18. శంబరాసుర వధ





లకూ చెందిన ప్రముఖులు నానా దేశాల నుంచి పెళ్ళికి తరలి వచ్చారు. వచ్చిన వారందరికీ సాత్యకి తగిన సత్కారాలు జరిపి, వసతులు ఏర్పాటు చేశాడు.

పెళ్ళిరోజు వచ్చింది. బ్రాహ్మణుల వేదాధ్యయనమూ, రాజులకు వంది మాగధులు చేసే కైవారాలూ, స్త్రీలు తిరుగాడుతూంటే వారి ఆభరణాల ధ్వనీ, ఏనుగుల ఘీంకారాలూ, గుర్రాల సకిలింపులూ, పెళ్ళి బాజాలూ, ఆకాశాన దేవదుందుభులూ, అన్నీ కలిసి చాలా సందడిగా ఉన్నది.

నాలుగు బంగారు స్తంభాలతో కళ్యాణ మండపం కట్టి, మాణిక్యాలతోనూ, పువ్వులతోనూ అలంకరించి, రంగవల్లులు చిత్ర విచిత్రంగా రచించి, అందులో మణిమయమయిన వేదిక మీద కృష్ణుడు కూర్చున్నాడు. అతని చుట్టూ ఉగ్రసేనుడూ, వసుదేవుడూ, బలరాముడూ, యదువృద్ధులూ, మునులూ కూర్చున్నారు. పురోహితుడు అగ్నిముఖం చేసి వేల్చుతున్నాడు.

ముహూర్తం వచ్చింది. సౌకుమార్యానికీ, సౌందర్యానికీ, సౌభాగ్యానికీ, సౌశీల్యానికీ ప్రతిరూపంగా కనిపించే రుక్మిణిని కృష్ణుడు పాణిగ్రహణం చేశాడు. అతని మీద ముత్తయిదువులు అక్షతలనూ, ఆకాశం

పెట్టారు. రకరకాల ముత్యాల ముగ్గులు చక్కగా అలంకరించారు. అంతటా పోక మానులూ, అరటిచెట్లూ అమర్చి, లేత రావి ఆకులతోనూ, మామిడాకులతోనూ తోరణాలు గట్టి, చీనాంబరాలతో తయారు చేసిన ధ్వజా లెత్తారు.

కృష్ణుడి పెళ్ళికి అతని బంధువులూ, అనేకమంది రాజులూ తమ తమ వైభవాలు ఉట్టిపడేలాగా, రథాలనూ, ఏనుగులనూ, గుర్రాలనూ వెంట బెట్టుకుని ఎంతో స్నేహ భావంతో వచ్చారు. కృష్ణుణ్ణి చూసి తమ తపస్సులు ఫలింప జేసుకుందామని మునులు వచ్చారు. ఇంకా, నాలుగు వర్ణా







పెళ్ళిరోజులు సుఖంగా వెళ్ళిపోయాయి. పెళ్ళికి వచ్చినవారు కృష్ణుడికి కట్నాలు చదివించి, అతని చవివింపులు అందుకుని, వెళ్ళిపోయారు.

కృష్ణుడు రుక్మిణితో దాంపత్య సౌఖ్యంలో ఓలలాడుతూనే, మిత్రవిందా, జాంబవతీ, సత్యభామా, కాళిందీ, సుదంతా అనే వారిని కూడా పెళ్లాడాడు.

కొద్ది కాలానికే కృష్ణుడి అగ్ర భార్య అయిన రుక్మిణి గర్భవతి అయింది. కృష్ణుడు తన హెూదాకు తగినట్టుగా ఆమెకు పుంస వనమూ, సీమంతమూ మొదలైన వేడుకలు జరిపాడు. కాలక్రమాన రుక్మిణి ఒక మగ శిశువును ప్రసవించింది. పూర్వం శివుడి మూడో కంటి మంటకు భస్మమైన మన్మ థుడే రుక్మిణి కడుపున జన్మించాడు. అత నికి ప్రద్యుమ్ను డని పేరు పెట్టుకున్నారు.

రుక్మిణి కడుపున పుట్టే ఈ బిడ్డ వల్ల తనకు చావున్నదని ముందే తెలిసి శంబరు డనే రాక్షసుడు, ఏడు రోజుల బాలింత పక్కలో పడుకుని ఉన్న ప్రద్యుమ్నుణ్ణి అర్ధ రాత్రి వేళ అపహరించి తీసుకు పోయి సముద్రంలో పారేశాడు. ఆ బిడ్డను ఒక పెద్ద చేప మింగింది. ఆ చేపను ఒక జాలరి వలలో పట్టి, అంత పెద్ద చేపను పట్టి

నుంచి దేవతా స్త్రీలు పుష్పాలనూ ఒకేసారి చల్లారు. బ్రాహ్మణులు ఆశీర్వచనం చేశారు. కృష్ణుడు తన తల్లిదండ్రులకూ, పెద్దలకూ నమస్కారం చేసి, వారి దీవనలు పొందాడు. తరవాత అతను అసంఖ్యాకులైన బ్రాహ్మ ణులకు ఎనిమిదివేల రథాలూ, పదకొండు వేల అయిదువందల ఏనుగులూ, అంతులేని గుర్రాలూ, ఆవులూ దానం చేసి, నగలనూ, బంగారాన్నీ, వెండినీ, దాసదాసీలనూ కాను కలుగా ఇచ్చి, సూతులూ, మాగధులూ, నర్తకులూ, వంది వైతాళికులూ మొదలైన వారికి అంతులేని బహుమానా లిచ్చి, అంద రికీ భోజనాలు పెట్టి సంతృప్తులను చేశాడు.





నందుకు సంతోషించి, దాన్ని తమ రాణి అయిన మాయావతికి కానుకగా ఇచ్చాడు. ఈ జాలరి ఇక్షుమతీ పురంలో ఉండే వాడే. ఆ ఇక్షుమతీ పురాన్నే శంబరుడు పాలిస్తున్నాడు. మాయావతి శంబరుడి భార్య.

మాయావతి జాలరి ఇచ్చిన చేపను తానే స్వయంగా తరిగి, అందులో అందమైన పిల్లవాడుండటం చూసి ఎంతో ముచ్చటపడి, వాణ్ణి పెంచి పెద్దవాణ్ణి చేసింది. తనకు పిల్లలు లేని కారణం చేత శంబరుడు కూడా ఆ పిల్లవాణ్ణి చూసి మురిశాడు.

మాయావతి పెంపకంలో పెరిగిన ప్రద్యుమ్నుడు రాక్షస మాయలన్నీ తెలుసుకున్నాడు; సకల విద్యలూ నేర్చుకుంటూ పెరిగి పెద్దవాడయాడు. చివరకు అతను ఎంత అందంగానూ, ఆకర్షణీయంగానూ తయారయాడంటే, పసితనం నుంచీ అతన్ని పెంచిన మాయావతికే అతని పైన మోహం పుట్టుకొచ్చి, తన కోరిక అతనితో చెప్పింది. అతను బుద్ధిమంతుడు కనక మాయావతితో, "నువు తల్లివి, నేను కొడుకును. నా పైన నీ కిలాటి భావం ఎలా కలిగింది? దీని కేదన్నా కారణం ఉంటే చెప్పు," అన్నాడు.

దానికి మాయావతి, "నీ తండ్రి యాదవ వంశోద్ధారకుడైన కృష్ణుడు. నీ తల్లి రుక్మిణి





దేవి. పురిటిలోనే నిన్ను శంబరుడు సముద్రంలో పారేస్తే, దైవికంగా నువ్విక్కడికి చేరావు. నేను నిన్ను ఇంతకాలమూ రక్షించాను. నీ కోసం నీ తల్లి ఇంతకాలమూ బెంగపడి ఉన్నది. నువు వెళ్ళి ఆమె కళ్ళ ఎదట పడు. నేను నీ అందం చూసి ప్రేమించాను. నన్ను నిరాకరించకు. శంబరుణ్ణి నేను మాయా మోహితుణ్ణి చేసి అతని భార్యగా నటిస్తూ వచ్చాను. అతను విరోధి. అతన్ని చంపెయ్యి," అన్నది.

మాయావతి ఇలా చెప్పేసరికి ప్రద్యుమ్నుడు శంబరుణ్ణి యుద్ధానికి పిలిచాడు. ఇద్దరికీ యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో ప్రద్యుమ్నుడు శంబరుడి పైన ఏడు మాయలు ప్రయోగించి, విఫలుడై, చివరకు ఎనిమిదవ మాయతో చంపేశాడు.

తరవాత అతను మాయావతిని వెంట బెట్టుకుని మాయా ప్రభావంతో ఆకాశ మార్గాన ప్రయాణం చేసి, కృష్ణుడి అంతః పురంలో దిగాడు. అకస్మాత్తుగా తమ మధ్య దిగిన ప్రద్యుమ్నుణ్ణి చూసి కృష్ణుడి భార్యలందరూ భయపడ్డారు. అతని అందచందాలు చూసి సంతోషం కూడా పొందారు. రుక్మిణి ఆ యువకుణ్ణి చూసి, తనకు పుట్టిన బిడ్డ బతికి ఉంటే ఈ పాటికి ఇంతవాడై ఉండే వాడు కదా అనుకున్నది. చూస్తున్న కొద్దీ ఈ కుర్రవాడిలో కృష్ణుడి లక్షణాలు కనిపించి, ఒకవేళ తన కొడుకే బతికి ఉండి ఇలా వచ్చాడేమో అన్న అనుమానం కూడా కలిగింది. కృష్ణుడు కూడా ఆ కుర్రవాణ్ణి ముఖమంతా కళ్ళు చేసుకుని చూస్తూ, ఆనందించ సాగాడు.

ఇంతలో నారదుడు అక్కడికి వచ్చి కృష్ణుడితో ప్రద్యుమ్నుడి కథ అంతా చెప్పాడు. అంతా స్పష్టమైపోయింది. ప్రద్యుమ్నుడు రుక్మిణి కొడుకే. మాయావతి కూడా పూర్వజన్మలో మన్మథుడి భార్య అయిన రతీదేవి. తిరిగి మళ్ళీ అతనికి భార్య





అయింది. మన్మధుడు పోయాక ఆమె శంబరుడికి చిక్కి, మాయారూపం ధరించి శంబరుణ్ణి మభ్యపెడుతూ, తన పాతి వ్రత్యాన్ని కాపాడుకున్నది.

తన కొడుకు తనకు మళ్ళీ దక్కినందుకు రుక్మిణి పరమానందం చెందింది. కృష్ణుడి భార్యలందరూ ఎంతో సంతోషించి, అంతఃపురంలో ఎన్నో విందులూ, వేడుకలూ చేసుకున్నారు.



రుక్మిణి తొలి కాన్పుకు ప్రద్యుమ్నుణ్ణి కనటమే గాక, వరసగా తొమ్మిదిమంది కొడుకులను కని, చిట్టచివర కొక కూతుర్ని కూడా కన్నది. ప్రద్యుమ్నుడి అనంతరం రుక్మిణి కన్న తొమ్మిదిమంది కొడుకుల పేర్లు చారుధేష్ణుడూ, సుధేష్ణుడూ, సుషేణుడూ, చారుగుప్తుడూ, చారువాహనుడూ, చారువిందుడూ, చారుభద్రుడూ, చారుగర్భుడూ, చారుడూ; కడగొట్టు పిల్ల పేరు చారుమతి. కృష్ణుడికి ఇతర భార్యలయందు భానుడూ, భానువిందుడూ, సంగ్రామజిత్తూ, దీప్తిమంతుడూ, వృకుడూ మొదలుగాగల అనేకమంది కొడుకులూ, మిత్రవతి మొదలైన అనేకమంది కూతుళ్ళూ కలిగారు.

ప్రద్యుమ్నుణ్ణి రుక్మిణి కన్న నెల లోపునే జాంబవతి సాంబుడనే కొడుకును కన్నది. అతను ప్రసిద్ధుడు. పసితనంలోనే బలరాముడు అతన్ని చేరదీసి, తన కొడుకులాగా పెంచాడు, అతనికి యుద్ధవిద్యలన్నీ నేర్పాడు. బలరాముడికి రేవతి యందు నిశాతుడూ, ఉల్మకుడూ అనే కొడుకులు కలిగారు. ఈ విధంగా బలరామకృష్ణులు పెద్ద బలగాన్ని కని, ఎంతో సుఖంగా జీవిస్తూ వచ్చారు.

విదర్భదేశంలో రుక్మిణి అన్న అయిన రుక్మికి శుభాంగి అని ఒక కూతురున్నది. ఆ శుభాంగి యుక్త వయస్కురాలయింది. ఆ పిల్లకు తగిన వరుణ్ణి సంపాదించటం కోసం రుక్మి స్వయంవరం ఏర్పాటు చేసి,



భూమి మీద ఉండే రాజులందరికీ ఆహ్వా నాలు పంపాడు. ఆ స్వయంవరానికి ఎందరెందరు రాజులో వెళ్ళారు; తన తల్లి దండ్రుల అనుమతి పొంది ప్రద్యుమ్నుడు కూడా సపరివారంగా బయలుదేరి వెళ్ళాడు. స్వయంవరం యథావిధిగా జరిగింది. శుభాంగి అదివరకే ప్రద్యుమ్నుడి అంద చందాలను గురించి విని, అతన్ని వరించటానికి నిశ్చయించుకుని ఉండటం చేత అతని మెడలోనే వరమాల వేసింది. స్వయంవరానికి వచ్చిన ఇతర రాజులందరూ ఆమె నిర్ణయాన్ని మెచ్చుకుని, వధూవరులు ఒకరి కొకరు తగి ఉన్నారని శ్లాఘించారు.

ప్రద్యుమ్నుడు శుభాంగిని పెళ్ళాడి ఇంటికి తిరిగి వచ్చాడు. కొంతకాలానికి ఆ దంపతులకు అనిరుద్ధుడు పుట్టాడు. అనిరుద్ధుడు పెరిగి పెద్దవాడవుతూ సమస్త శాస్త్రాలూ, శస్త్రాస్త్ర విద్యలూ నేర్చి యుక్త వయస్కుడయాడు. అతనికి పెళ్ళి యీడు వచ్చింది.

రుక్మికి రుక్మవతి అనే మనుమరాలు, కొడుకు కుమార్తె, ఉన్నది. ఆ పిల్లను అనిరుద్ధుడికి అడగమని కృష్ణుడు సూచించగా ప్రద్యుమ్నుడు దూత ద్వారా రుక్మికి కబురు పంపాడు.

రుక్మి కూడా, పాత పగలు మరచి, సరే నన్నాడు. పెళ్ళి నిశ్చయమయింది. పెళ్ళికి బలరామకృష్ణులూ, ప్రద్యుమ్నుడు మొదలైన కుమారులూ, అనిరుద్ధుడూ, రుక్మిణీ, అనేకమంది యాదవ ముఖ్యులూ తరలి వెళ్ళారు. వివాహం వైభవంగా జరిగింది.

అందరూ మహోల్లాసంగా ఉన్న సమయంలో వేణుధారీ, శ్రుతపర్వుడూ, అంశుమంతుడూ, జయత్సేనుడూ మొదలైన దాక్షిణాత్యులు తమ మిత్రుడైన రుక్మితో, "నువు జూదంలో నేర్పరివి గద. బలరాముణ్ణి కదిలించి చూడు. అతను కాస్త వ్యసనపరుడు. అతన్ని ఓడించి మనం ప్రతిష్ఠ సంపాదింతాం," అని బోధించారు.





# అరణ్యపురాణం

## 21

మర్కటులు కావాను చూసి, తనను వది లేసి పారిపోగానే భాలూ పెద్ద పెట్టున నిట్టూర్చాడు.

కావా నోరుతెరిచి భయంకరంగా ఒక్క సారి బుస కొట్టాడు. మర్కటులు, ఎక్కడి వాళ్ళక్కడ స్తంభించి పోయి, మాట్లాడటం మానేశారు. అంతటా నిశ్శబ్దం ఆవరించింది. ఆ నిశ్శబ్దంలో మౌగ్లీకి, బాఘీర నీటి నుండి బయటికి వస్తూ తన ఒంటి మీది తడి విది లించు కోవటం వినబడింది.

బాఘీర రొప్పుతూ, "నా పని అయి పోయింది. మనిషికూనను ఆ మండపంలో నుంచి బయటపడెయ్యి. వాణ్ణి తీసుకుని పోదాం. లేకపోతే మర్కటులు మళ్ళీ మీద పడగలరు," అన్నాడు.

"బుస్! ఆగండి. ఆ మర్కటులు నా ఆజ్ఞ లేకుండా కదల లేరు....నేను ఇంకా ముందు రాలేక పోయాను," అని కావా బాఘీరతో, "తమ్ముడూ, నువు ఎవరినో పిలిచినట్టున్నావు?" అన్నాడు.

"యుద్ధోద్రేకంలో నేను కేక పెడితే పెట్టి ఉండవచ్చు ... గాయపడ్డావా, భాలూ?" అన్నాడు బాఘీర.

భాలూ కాళ్ళూ, చేతులూ ఆడించి చూసు కుంటూ, "నన్ను ఓ వంద పిల్లభాలూల కింద విడ గొట్టటానికి వాళ్ళు ప్రయత్నిం చారు. అబ్బ, ఒళ్ళంతా హూనమయింది! కావా, ఇవాళ నువు మా ఇద్దరి ప్రాణాలూ కాపాడా వనటాని కేమీ సందేహం లేదు," అన్నాడు.

"దాని కేం లే. మనిషికూన ఎక్కడ?" అన్నాడు కావా.

"ఇక్కడే! ఈ బోనులో. ఇందులో నుంచి పైకి ఎక్కలేను," అన్నాడు మౌగ్లీ.

అట్ట చివరి బొమ్మ



"పీట్లా తీసుకు పోండి. నెమలి లాగా నాట్యం చేస్తున్నాడు. మా పిల్లల్ని తొక్కేస్తాడు," అన్నారు మండపంలోని పాములు.

"ఆహా! ఈ మనిషికూనకు అందరూ స్నేహితులేనే! మనిషికూనా, కొంచెం దూరం వెళ్ళు. విషపు జీవుల్లారా, వెళ్ళి దాక్కోండి. నేనీ గోడ పడగొట్ట బోతున్నాను," అన్నాడు కావా.

అతను చలవరాతి చెక్కడపు గోడలో బీట ఉన్న చోటు వెతికి, గురి కోసం ముక్కుతో అక్కడ రెండు మూడుసార్లు తేలికగా కొట్టి, తన శరీరంలో ఆరడుగులు పైకి లేపి, అరడజను బలమైన దెబ్బలు కొట్టాడు. చెక్కడం పొడి పొడి అయి, రాలి పడింది. ఇంత ధూళి లేచింది. అక్కడ ఏర్పడిన కంతలో నుంచి మౌగ్లీ బయటికి దూకాడు. అతను భాలూ మీద ఒక చెయ్యీ, బాఘీర మీద ఒక చెయ్యీ వేసి, ఇద్దరినీ కౌగలించుకున్నాడు.

భాలూ మౌగ్లీని మృదువుగా కౌగలించుకుంటూ, "గాయపడ్డావా, నాయనా?" అని అడిగాడు.

"గాయాలే కాదు, ఆకలి దహించుకుపోతున్నది. అయ్యయ్యో, మీ రిద్దరూ బాగా గాయపడ్డారే! నెత్తురు కూడా కారుతున్నది!" అన్నాడు మౌగ్లీ.

నీటితొట్టెల దగ్గిరా, డాబా ప్రదేశం మీదా చచ్చిపడి ఉన్న మర్కటులను చూస్తూ, "గాయపడింది అచ్చగా మేమే కాదులే!" అన్నాడు బాఘీర, పెదవులు నాక్కుంటూ.

"ఏమీ ఫరవా లేదు. నువు బతికుండటమే చాలురా, కప్పాయ్!" అన్నాడు భాలూ, మౌగ్లీ వీపుతడుతూ.

"అదంతా తరవాత చూసుకోవచ్చు. ముందు కావాకు కృతజ్ఞత చెప్పుకో, మౌగ్లీ. అతను లేకపోతే ఈ యుద్ధం సాధ్యమయేది కాదు, నువు దక్కేవాడివీ కావు," అన్నాడు బాఘీర.



మౌగ్లీ కావా కేసి తిరిగాడు. కావా తల మౌగ్లీ తలకు ఒక అడుగు ఎత్తున అడుతున్నది. "ఇతగాడా మనిషికూన? ఒళ్ళు మహా మెత్తగా ఉంది. మసకవెలుగులో నిన్ను చూసి మర్కటు డనుకోగలను, జాగ్రత్తరా, బాబూ," అన్నాడు కావా.

మౌగ్లీ కృతజ్ఞత తెలుపుకుని, అవసరమైనప్పుడు కావాకు వేటలో సహాయపడతానన్నాడు. కావా ఒక్క క్షణంపాటు తన మెడను మౌగ్లీ భుజం మీద అనించి, వృద్ధిలోకి రమ్మని ఆశీర్వదించి, "చంద్రుడు అస్తమించుతున్నాడు. ఇక నువు నీ మిత్రులతో వెళ్ళిపోయి, నిద్రతియ్యి. ఇక్కడ జరగబోయే కర్మకాండ నువు చూడదగినది కాదు," అన్నాడు.

చంద్రుడు కొండల చాటుకు పోతున్నాడు. భాలూ నీళ్ళు తాగటానికి వెళ్ళాడు. బాఘీర తన శరీరమంతా శుభ్రం చేసుకున్నాడు. కావా మిద్దె మధ్యకు పాకి వెళ్ళాడు. మర్కటులు మసకచీకట్లో గోడల మీదా, గొబ్బెల మీదా ఎత్తున ఒకరినొకరు ఒరుసుకుని కూర్చుని ఉన్నారు.

"చంద్రుడు అస్తమించాడు. మీకు చూపు అనుతున్నదా?" అని కావా మర్కటుల నడిగాడు.



"చూస్తున్నాం, కావా," అన్నారు మర్కటులు.

"కదలకండి. ఆకలినృత్యం చూడండి," అంటూ కావా తలను ఈ పక్కకూ, ఆ పక్కకూ ఆడిస్తూ ఒక పెద్ద వలయంలో రెండు మూడుసార్లు తిరిగి, అతి వేగంగా తన శరీరాన్ని రకరకాల రేఖలలో తిప్ప సాగాడు. ఎనిమిది సంఖ్యలూ, చతురస్రాలూ కనిపించి మాయమవుతున్నాయి.

భాలూ, బాఘీరలు కొయ్యబారి పోయి కావా శరీరపు కదలికల కేసి చూస్తున్నారు.

"మర్కటులారా, దగ్గిరికి రండి," అన్నాడు కావా.



మర్కటులు, ఎవరో లాగినట్టుగా కావా కేసి ఒక అడుగు వచ్చారు. వాళ్ళతోబాటు భాలూ, బాఘీరలు కూడా ముందుకు ఒక అడుగు వేశారు.

"ఇంకా దగ్గిరికి!" అని కావా పెద్ద కేక పెట్టాడు.

మౌగ్లీ, భాలూ బాఘీరల మీద చేతులు వేసి, వాళ్ళను వెనక్కు లాగాడు. వాళ్ళిద్దరూ నిద్రమేలుకున్నట్టుగా అయారు.

"చెయ్యి తియ్యకు, తమ్ముడూ. లేకపోతే నేను కావా దగ్గిరికి పోతాను," అన్నాడు బాఘీర రహస్యంగా.

"ఏముంది అందులో? కావా మెలికలు తిరుగుతున్నాడు. మనం పోదాం," అన్నాడు మౌగ్లీ.

వాళ్ళు మళ్ళీ అరణ్యవృక్షాల కిందికి చేరాక భాలూ పెద్దగా శ్వాస విడిచి, "ఓహ్! నే నెన్నటికీ కావా స్నేహం కట్టను," అన్నాడు.

"వాడు మన తలదన్నినవాడు. ఇంకొక్క క్షణం ఉంటే నేను వాడి నోట్లోకే నడిచి ఉందును," అన్నాడు బాఘీర.

"తిరిగి చంద్రుడు ఉదయించే లోపుగా ఆ నోట్లోకి ఎందరు నడవనున్నారో! వాడి వేట బాగానేసాగుతుంది," అన్నాడు భాలూ.

"పెద్ద పాము అర్థం లేకుండా మెలికలు తిరగటం తప్ప నా కేమీ కనిపించ లేదే?" అన్నాడు మౌగ్లీ. కావా నృత్యంలో గల సమ్మోహనశక్తి మౌగ్లీకి అర్థం కాలేదు. అతను మనిషికూన.

మౌగ్లీని బాఘీర తన వీపు మీద ఎక్కించుకుని బయలుదేరాడు. మౌగ్లీ బాఘీర వీపు మీదనే నిద్రపోయాడు. భాలూ బాఘీరలు తనను గుహకు చేర్చటమూ, తోడేలమ్మ సరసన పడుకో బెట్టటమూ కూడా వా డెరగడు....

ఆ విధంగా పసితనం లోనే మౌగ్లీకి కావాతో పరిచయం కలిగింది.



# 75. "అయుథ్య"

థాయిలాండు దేశానికి "అయుథ్య" (జయించరానిది) నగరం నాలుగు శతాబ్దాలపాటు రాజధానిగా ఉండింది. అక్కడ ఉండిన ఈ ఆలయంలో పూర్వరాజుల అస్థికలు నిక్షేపించ బడ్డాయి. ఈ ఆలయం ఇప్పుడు బాగా శిథిలావస్థలో ఉన్నది. అయుథ్యను 1767 లో బర్మావాళ్ళు కొల్లగొట్టారు.



Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

మా చిన్నిపాపలు మాకళ్ళ వెలుగు

పంపినవారు :
పి. సుబ్బారాయుడు, వేటపాలెం

Photo by Anant Desai



బహుమతి పొందిన వ్యాఖ్య

గోపాలకృష్ణమ్మ గోవులకు వెలుగు

పంపినవారు: పి. సుబ్బారాయుడు, వేటపాలెం

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1968 ఏప్రిల్ నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ ఫెబ్రవరి నెల 20-వ తేదీ లోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## ఫెబ్రవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: మా చిన్నిపాపలు మాకళ్ళ వెలుగు

రెండవ ఫోటో: గోపాలకృష్ణమ్మ గోవులకు వెలుగు

పంపినవారు: పి. సుబ్బారాయుడు,

టీచర్, వేటపాలెం. (గుంటూరు జిల్లా)

బహుమతి మొత్తం రు. 10/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'



నన్ను
అందరూ
దూరము చేశారు!

కాని, తప్పు నాదేనేమో!
నేను ఓపికలేక నీరసంగా,
నిర్లక్ష్యముగా వుండేదాన్ని.
అయితే, దానికి
ఉపాయము దొరికింది.

డాక్టర్ని సంప్రదించాను.
"మీకు కావలసింది,
అధిక శక్తి కొరకు
అధిక పోషణము, దాన్ని
కలిగించడంలో హార్లిక్స్
సహాయపడుతుంది."
అని డాక్టరు అన్నారు.

హార్లిక్స్ అలాగే చేసింది.
ఇప్పుడు నేనెంతో
సంతోషంగా,
ఉత్సాహంగా వున్నాను!
క్రొత్త స్నేహాలు చెయ్యడం
యిప్పుడెంతో సులువు.
హార్లిక్స్ సహాయంతో
నాకొక క్రొత్త జీవితం
ప్రారంభమయింది!

## ఇప్పుడు నేను ఉత్సాహముతో కూడిన నూతన వ్యక్తిని...దానికి కారణం

## హార్లిక్స్



సరైన పోషణ లేకపోవడం వల్లనే చాలామంది వ్యక్తులు శక్తి ఉత్సాహాలను కోల్పోతారు. అలాంటప్పుడు హార్లిక్స్ వాడడంవల్ల ఒక క్రొత్త జీవితం ప్రారంభ మవుతుంది. హార్లిక్స్‌లోని సారవంత మైన పరిపోషకతత్వము క్రొత్త బలాన్ని మరియు శక్తినీ కలిగించి అలసటతో కూడిన నీరసాన్ని పోగొడుతుంది. సహజ పోషక పదార్థములను సులువుగా జీర్ణ మయేలా చేసినదే హార్లిక్స్.



గోధుమపిండి మరియు మాల్టెడ్ బార్లీల పోషకవంతమైన
సారములు మరియు పూర్తి మీగడగల పాలతో చేయబడినది

# హార్లిక్స్




అదనపు శక్తిని కలిగించును!

